టెండరు నోటీసు

## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే

దిగువ సెక్షనులకు గాని సబ్ డివిజనులకు గాని ఒక్కొక్క దానికి పీస్‌వర్కు కంట్రాక్టులకు విడివిడిగా సీలువేసిన టెండర్లు 12-12-1949 తేది సోమవారము పగలు 12 గం. వరకు, మద్రాసులోని ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే చీఫ్ యింజనీరు గారిచే తీసుకొనబడును.

| డిస్ట్రిక్టు. | సబ్ డివిజన్. | సెక్షన్. |
|---|---|---|
| 1. బళ్లారి | బళ్లారి | 1. గడగ్ |
| | | 2. హొస్పేట |
| | | 3. బళ్లారి |
| | | 4. హంపా పట్నం |
| | | 5. యశ్వంత్ నగర్ |
| | | 6. ఒబ్లాపురం. |
| 2. హుబ్లి | హుబ్లి | 1. రాణి బెన్నూర్ |
| | | 2. యల్వగి |
| | | 3. హుబ్లి |
| | | 4. ధార్వార్ |
| | | 5. లోండ |

సెట్టు 1-కి పదిరూపాయల వంతున రొక్కము చెల్లించి దరఖాస్తు మీద చీఫ్ యింజనీరు గారినుండి టెండరు ఫారాలు యితర డాక్యుమెంట్లు పొంద వచ్చును. ఈ సొమ్ము వాపసు చేయబడదు.

మద్రాసు, పార్కు టౌన్‌లోని ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే ఫైనాన్షియల్ అడ్వయిజర్ అండ్ చీఫ్ అకౌంట్సు ఆఫీసరుకు ముందుగా ఒక్కొక్క టెండరుకు రు. 2,000/-ల ధరావతు సొమ్ము చెల్లింపవలెను.



# చేనేత పరిశ్రమకు శాశ్వతరక్షణ సదుపాయం

## "మిల్లుపరిశ్రమ పరిమితం కావాలి"

### రాష్ట్ర చేనేత కాంగ్రెస్ మహాసభ తీర్మానం

చీరాల, నవంబరు 14: చెన్నరాష్ట్ర చేనేత కాంగ్రెస్ ప్రత్యేక మహాజన సభ యిక్కడ శానిన బసవరాజు గారి అధ్యక్షతను నిన్న మొన్న జరిగెను.

12 వ తారీఖు మధ్యాహ్నం 2 గంటలకు సర్వసభ్య మహాసభ, అధ్యక్షులు రానందున వారి స్థానే ఉపాధ్యక్షులు డి. కె. వర్మగారి అధ్యక్షతను సమావేశమైనది.

అధ్యక్షత వహించిన డి. కె. వర్మగారు సభా సమావేశ ఉద్దేశ్యములను వివరించుచూ తమ అధ్యక్షోపన్యాసమును గావించిరి. వారి ఉపన్యాసములో చేనేత కార్మికులకు అమోఘ సేవ చేయుచున్న 'చేనేత పత్రికను' పోషించమని విజ్ఞప్తి గావించిరి. చేనేత పారిశ్రామికులకు ప్రతి బంధకముగ యున్న కమ్యూనిస్టులను పట్టి ప్రభుత్వమునకు ఒప్పజెప్పవలెనని చేనేత పారిశ్రామికులకు ఉద్బోధించిరి.

తదుపరి గుంటూరుజిల్లా చేనేత కాంగ్రెస్ కార్యదర్శి అక్కల కోటయ్యగారు సభా సభులకు స్వాగతము యిచ్చుచూ విజయవాడ కార్యవర్గము వారు చేసిన సత్యాగ్రహ తీర్మానము యొక్క అవశ్యకతను ఉద్ఘాటించిరి. విజయవాడ తీర్మానము చీరాల సవరణ తీర్మానమును బాగా చర్చించి చేనేత పరిశ్రమ రక్షణకు తలకుము నిర్ణయమును గావింపమని కోరిరి. తదుపరి దేశభక్త కొండ వెంకటప్పయ్య గారి మరణమునకు సానుభూతి, వరద, తుపానువల్ల నష్టపడిన వారికి సానుభూతి తెలుపబడెను. ఈ తీర్మానము మీద ప్రగడకోటయ్య, అక్కల కోటయ్యగా ర్లుపన్యసించిరి.

#### 2 వ సమావేశము

కాశిన బసవరాజు గారి అధ్యక్షత క్రింద ఆదివారం ఉదయం 7 గం॥ లకు మ్యునిసిపల్ హైస్కూలులో కార్యవర్గ సమావేశము జరిగి మహాసభలో చర్చింపవలసిన చిత్తు తీర్మానములు గావింపబడెను. తదుపరి విజయవాడలో 4-10-49 తేదీన గావింపబడిన తీర్మానము చర్చకు వచ్చెను.

ఆ తీర్మానం నకలు : "చేనేత పరిశ్రమ శాశ్వతరక్షణకై మిల్లుపరిశ్రమను మితపరచవలసిన ఆవశ్యకత నేకు ఎంతేని కలదు. ఇందుకై ప్రభుత్వం 1949 నవంబరు ఆఖరులోగా తమ కనీసపుకోర్కెలను ఈడేర్చనిచో 1-12-49 నుండి చేనేత పారిశ్రామికులు శాంతి యుతమైన సమరమును ప్రారంభింపవలసి వచ్చునని ఈ కమిటీ ప్రభుత్వమునకు నివేదిస్తున్నది. ఈ శాంతి యుత సమరమునందు తమ కనీసపుకోర్కెలకు సత్వర విజయమును చేకూర్చుటకై చేనేతవారందరు సంసిద్ధులై వుండవలెనని ఈ కమిటీ హెచ్చరించుచున్నది."

పై తీర్మానముమీద కార్యవర్గసభలో తీవ్రచర్చలు 4 గంటలవరకు జరిగినవి. చివరకు, సర్వసభ్య సమావేశ ఆమోదమునకై ఈ క్రింది విధముగా సవరింపబడెను.

"ప్రభుత్వమువారు చేనేత పరిశ్రమకు రక్షణ యిచ్చుటకు అంగీకరించిరిగాన వారికి కొంతకాలము వ్యవధియిచ్చి తమ పరితృప్తికరమగు ఫలితము లేకున్నచో అప్పుడు శాంతిసమరము జరుపుటకు ఆలోచన జరుగును."

#### ప్రతినిధుల సమావేశము

రెండవరోజు సాయంకాలము సర్వసభ్య సమావేశము కాశిన బసవరాజు గారి అధ్యక్షతను జరిగినది. సభా విజయమును వాంఛించుచు మద్రాస్ ప్రధాని స్థానిక సంస్థలమంత్రి కల్లూరి చంద్రమౌళి, దేవదాయ మంత్రి బి. పరమేశ్వరన్, గార్లు మరి తదితరులు సందేశాలుపంపిరి.

తదుపరి సభలో 9 తీర్మానములు గావింపబడెను. అందు ముఖ్యమైనవి కీ॥ శే॥ కవిబ్రహ్మ ఏటుకూరి వెంకట నర్సయ్యగారి మరణమునకు చింతిల్లుచూ ఒక తీర్మానం గావించిరి. నూలు చేనేత వస్త్రములపై అమ్మకపుపన్ను తొలగించమని, ప్రభుత్వాఫీసులకు చేనేత వస్త్రములను ఉపయోగించవలెనని, చేనేత వారి శ్రామికులను వెనుకబడిన జాతిలో చేర్చి వారికి వెనుకబడిన జాతులవారికి యిచ్చు సౌకర్యములను ఒసగూర్చుమని, చేనేత పరిశ్రమకు కావలసిన సౌకర్యము లన్ని ఏర్పాటుచేయుమని, చేనేత పనివారికి ఉచితముగా ఆరోగ్యపరిరక్షణ క్రమముగా కల్పించవలెనని, చేనేత పారిశ్రామికులకు నూతన నాగరికతలో ఎసెంబ్లీలలో ప్రాతినిధ్యము యిప్పించమని, చేనేతపనివారికి గాను ధాన్యం కొనుగోలుచేసి చేనేతసహకారసంఘాలు సరఫరాచేయుటకు అవకాశ మివ్వమని ప్రభుత్వంవారిని కోరిరి.

తదుపరి ప్రగడకోటయ్యగారు 'విజయవాడ తీర్మానం, దానిమీద కార్యవర్గము వారు చేసినసవరణను ప్రతిపాదించిరి. వారు ఆ తీర్మానము ప్రతిపాదించుటకు ముందు పూర్వాపరసందర్భములను ఉగ్గడించుచు, విజయవాడ తీర్మానమును సవరణచేయుటకుగల కారణములు చెప్పిరి.

సవరు తీర్మానమును బలపరచుచూ అక్కలకోటయ్యగారు ఒకదీర్ఘోపన్యాసమును గావించిరి.

కార్యవర్గమువారు సూచించిన తీర్మానమును ఎదిరించుచూ విజయవాడ తీర్మానము అక్షరాలా అమలుపరచవలెనని పరువూరు మాట్లాడిరి. మోరి నాస్తవ్యులు జానవీరభద్రరావుగారు మాట్లాడుచూ ది 1-12-49 తారీఖునుండి ఆనాటకు బదులు అవసరము వచ్చినప్పుడు శాంతిసమరం జరుపుటకు మనం కార్యవర్గమువారికి అధికారమివ్వవలెనను సవరణను ఉపపాదించిరి. అడిగోపుల బలరామయ్య, కొండూరి ఆదిశేషు, జంజనం నరసింహం, కార్యంపూడి వెంకటపెరుమాళ్లుగార్లు కార్యవర్గమువారు తెచ్చినతీర్మానమునకు వ్యతిరేకముగా మాట్లాడి 1-12-49 నుండియే శాంతిసమరము జరుపవలెనని విజయవాడ తీర్మానమును బలపరచుచూ మాట్లాడిరి. ఆకురాతి రంగనాయకులు (ఈపూరిపాలెం) పెండెం వెంకట్రాములు (చీరాల) జంకా వెంకటసుబ్బయ్య (మద్రాసు) పాస్నేరి రామకృష్ణయ్యగారు (చీరాల) కార్యవర్గసవరణ తీర్మానమునకు అనుకూలముగా మాట్లాడిరి. కాని ప్రగడ కోటయ్యగారు జాన వీరభద్రయ్యగారు సూచించిన విధముగా ఒకసవరణను ఉపపాదించిరి. తదుపరి తీర్మానమును ఓటుకుపెట్టగా ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

#### మహాజనసభ

డి. కె. వర్మగారి అధ్యక్షతను బహిరంగసభ జరిగినది. పచ్చాగు వెంకటేశ్వర్లుగారు కొన్ని చేనేత పద్యములను చదివిరి. పెండెం వెంకట్రాములుగారు వేటపాలెం కట్టా అచ్చయ్య కవిగారిని సభికులకు ఎరుకపరచినతర్వాత కవిగారు 'వస్త్రకారుడా' అను వారు రచించిన ప్రబంధమునుండి కొన్ని పద్యములను చదివి వినిపించిరి. గుత్తి వెంకట శివయ్యగారు చేనేత పరిశ్రమకు సంబంధించిన కొన్ని గేయములను పాడిరి.

తదుపరి శాఖ్యకోటి వీరయ్య, బూదాటి ఆదయ్య, హైద్రాబాదుసంస్థాన చేనేత కాంగ్రెస్ ప్రధాన సంచాలక్ ఎదిరె చెన్నకేశవులుగార్లు "నేటి చేనేత పరిస్థితిమీద" ఉపన్యసించిరి. ప్రగడ కోటయ్యగారు గుంటూరుజిల్లా చేనేత కాంగ్రెస్‌వారు సభావిజయమునకు చేసిన ప్రయత్నములను అభినందించుచూ మాట్లాడిరి. అక్కల కోటయ్యగారి ధన్యవాద సమర్పణముతో సభ జయజయధ్వనుల మధ్య రాత్రి 9 గంటలకు సభ ముగిసినది. రాత్రి భోజనానంతరం హైస్కూలులో "చేనేత విజయం" అను బుర్రకథ కాలక్షేపము గావింపబడెను.

సభకు షుమారు 400 ప్రతినిధులు వివిధ జిల్లాలనుండి వచ్చిరి. షుమారు 5000 ప్రేక్షకులు వచ్చిరి. దూరశ్రవణయంత్రములు ఏర్పాటుచేయుటచే సభికులకు ఉపన్యాసము వినుటలో యిబ్బంది కలుగలేదు

## డిటెన్యూలవిడుదల కేసులు

మదరాసు హైకోర్టు న్యాయమూర్తులు గా॥ వి. గోవిందమీనను, ఒషీరుఅహమ్మదు గార్లు నాల్గు హెబియసుకార్పసు అప్లికలు 18 వ తేదీన నిరాకరించిరి. వేలాయుధం, సుబ్రహ్మణ్యం, ధనుష్కోడి, కె. పి. కావేరి అను నల్గురిని పోలీసు కమిషనరు అక్టోబరు 11 వ తేదీన నిర్బంధించెను. అక్టోబరు 10 వ తేదీన హైకోర్టు జడ్జీలు, ప్రజారక్షణ ఆర్డినెన్సు చట్రమునకు వ్యతిరేకమని తీర్పు చెప్పియుండిరి. దానిప్రకారమే మరునాడు నిర్బంధించుట న్యాయవిరుద్ధమని వాదించబడెను. అక్టోబరు 16 వరకు హైకోర్టు తీర్పు కమిషనరుకి తెలియజేసినా కమిషనరు తిరిగి వాదనకు. ఆనాడే ప్రభుత్వంవారు తిరిగి ఆర్డినెన్సు జారీచేసి 19 వ సెక్షను ప్రకారం ఎనకటి (1947 చట్టం) ప్రకారం జరిగిన చర్యలన్నీ సక్రమముగునవి శాసించియుండిరి. అందుచే యీ నల్గురు డిటెన్యూలను విడుదలచేయ వీలులేకున్నదని న్యాయమూర్తులు తీర్పు చెప్పిరి.

# రాష్ట్రంలో పారిశ్రామికాభివృద్ధి

## శీఘ్రసాధనకుప్రధానివిన్నపం

చెన్నపట్నం, నవంబర్ 19: చెన్నరాష్ట్రమును సంపన్నమొనర్చుటకు పరిశ్రమలు త్వరితముగా పెంపొందించుట అవసరమని నిన్న సాయంత్రం ప్రధాని శ్రీ పి. యస్. కుమారస్వామిరాజాగారు మదరాసు పరిశ్రమల సంఘుదశమ వార్షికోత్సవమునకు అధ్యక్షతవహిస్తూ విన్నవించిరి. దేశపరిశ్రమలకు దోహదమొసగే ప్రణాళికలో భారీపరిశ్రమలు కుటీరపరిశ్రమలు సమాన ప్రాధాన్యము కలిగి పరస్పర అభివృద్ధియగుటకు అవకాశము న్నదని కూడా ప్రధాని శ్రీ రాజాగారు నుడివిరి.

సంఘాధ్యక్షుడు శ్రీ కే. వెంకటస్వామి నాయుడుగారు మదరాసు మంత్రులు యితరపుర ప్రముఖులకు స్వాగతమొసగుచూ దేశములో తయారగుచున్న వస్తువులను ప్రదర్శించి పరిశ్రమలకు సర్వ ప్రోత్సాహమొసగుట యీ సంఘం ఉద్దేశ్యమనిరి.

కార్యదర్శి శ్రీ యం. బాపినీడుగారు వార్షికనివేదిక చదువుచూ పారిశ్రామిక ప్రదర్శనశాలలను విస్తరింపచేయుటకు ఎక్కువ సలను కావలసియున్నదని సూచించిరి.

శ్రీ కుమారస్వామి రాజాగారు మదరాసు పరిశ్రమల సంఘము కేంద్రపారిశ్రామిక వస్తుప్రదర్శనశాలను స్థాపించి పరిశ్రమల అభివృద్ధికై చేస్తున్న సేవను ప్రస్తుతించిరి. రాష్ట్రములో పరిశ్రమలు ముఖ్యముగా కుటీర పరిశ్రమలకు ప్రోత్సాహమొసగుటలో ప్రభుత్వమునకు సంఘమునకు సమానమైన ఉద్దేశ్యమే యున్నదనియు దేశము సంపదతో తులతూగవలెనంటే పరిశ్రమలను బాగా అభివృద్ధి పరచవలసియున్నదనియు పలికిరి. దేశములో తయారగు పారిశ్రామిక పదార్థములను జనసమ్మతమొనర్చుటకు యిట్టి ప్రదర్శనశాలలు ఉపయుక్తమగును గాన రాష్ట్రములో అట్టి వాటిని పెంపొందించుట చాలా అవసరమనిరి. మదరాసు వస్తుప్రదర్శనశాల రాష్ట్ర ఆర్థక పారిశ్రామికాభివృద్ధికి దోహదమొసగుటకు యత్నించుచున్నందుకు సంఘమును ప్రశంసించిరి.

### బాపినీడు చిత్రపటావిష్కరణ

శ్రీ కె. వెంకటస్వామి నాయుడుగారి కోరికపై తర్వాత ఆర్థికమంత్రి శ్రీ బి. గోపాలరెడ్డిగారు మదరాసు పరిశ్రమల సంఘము స్థాపితమైనప్పటినుండి కార్యదర్శిగా సేవచేస్తూ కేంద్ర పారిశ్రామిక వస్తుప్రదర్శనశాలను అభివృద్ధిలోకి తెచ్చిన శ్రీ మాగంటి బాపినీడుగారి ఛాయాచిత్రమును ఆవిష్కరించిరి. శ్రీ బాపినీడు గారు దేశ స్వాతంత్ర్య పోరాటములోకి యే రీతిగా ఆకర్షింపబడి సేవచేసినది హరిజనాభ్యుదయమునకై ఆంధ్ర హరిజన సేవా సంఘాధ్యక్షుడుగా నుండి చేసిన అమోఘ సేవను శ్రీ గోపాలరెడ్డిగారు కొనియాడి ఆయనను "హరిజనబంధు" అని పిలువవచ్చు ననిరి. ప్రస్తుతము శ్రీ బాపినీడు గారు ప్రభుత్వ కొరవడా హోదాలో ప్రభుత్వానికి స్పీకరుకు యితర పార్టీల మధ్యలం కగా నుండి పార్లమెంటరీ వ్యవహారములు సక్రమముగాను చక్కగాను నిర్వహింపగల్గుచున్నారనిరి.

సంఘ ఉపాధ్యక్షుడు శ్రీ పి. యం. అదికేశవులు నాయకరుగారు వందన మర్పించిరి.

## పెద్ద ఉద్యోగులకు జీతం తగ్గింపు

మదరాసు, నవంబరు 18 : రాష్ట్రప్రభుత్వముక్రింద పనిచేయుచున్న పూర్వ పుఇండియా కార్యదర్శి ఉద్యోగులు, రు 2150 కి మించిన జీతము తీసుకొను వారికి జీతములలో తగ్గింపువిధిగా అమలు జరుపవలెనని ఇండియా ప్రభుత్వము మదరాసు ప్రభుత్వమునకు వ్రాసియున్నది. రు 2750 నుండి రు 3000 ల వరకు గల జీతములు రు 2750 కి తగ్గించబడును. రు 3 వేలకు మించిన జీతములు గలవారికి పిచ్చులో 25% తగ్గించెదరు. ఈ తరగతి ఉద్యోగులు ఈ రాష్ట్రములో 12 కి మించి లేరు.

రు 250 లు, అంతకుమించి జీతములు తీసుకొనువారికికూడా తగ్గింపును వర్తింపజేయుటనుగురించి పరిశీలించవలెనని కూడ ఇండియా ప్రభుత్వము కోరినదనియు, ఈ విషయమును మంత్రివర్గము పరిశీలించగలదని ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు విలేఖరులతో అనిరి. ఈ స్కీమును అమలుజరుపు విషయములో రాష్ట్రమునకు స్వేచ్ఛ ఇవ్వబడినదనికూడ వారు చెప్పిరి.

### మదరాసు గవర్నరు

మదరాసు, నవంబర్ 18 : మదరాసు గవర్నరు భావనగర్ మహారాజా, మహారాణి మస్సురు కుమార్తెలతో కూడ గొంరాయి నుండి నిన్న మధ్యాహ్నం మదరాసు తిరిగి వచ్చిరి.

# అవసరవస్తువుల కంట్రోల్ బిల్లుకు కౌన్సిల్ ఆమోదం

## జమీందారీ పరిహార నిబంధనల ప్రకటన

మద్రాసు, నవంబరు 18: నేడు మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలులో అవసర వస్తుసామగ్రి కంట్రోలు బిల్లుపై చర్చజరిగి ఆమోదింపబడెను.

జనాబ్ అబ్దుల్ లతీఫ్ ఫకీరాగారు అవసర పదార్థముల కంట్రోలు తాత్కాలిక అధికారముల బిల్లును 15మంది సభ్యులుగల ఉభయసభల సెలెక్టు కమిటీ (5 మంది సభ్యులు కౌన్సిలు నుండి, 10 మంది అసెంబ్లీనుండి) నియామకము విషయమై ఆలోచనకు పెట్టవలెనని ప్రతిపాదించిరి. ప్రజలకు ప్రతిరోజు కావలసిన పదార్థముల ధరలను తగ్గించుటకు ఉత్పత్తి ఎక్కువ కావాలిగాని యిట్టి కంట్రోళ్ళవల్ల ప్రయోజనము లేదనిరి. కంట్రోళ్ళు దొంగమార్కెట్టుకు ప్రోత్సాహమొసగగలవనిరి. ప్రజలు సత్ప్రవర్తన కలిగియుండుటకు నలయు పరిస్థితులను ప్రోత్సహించవలెను గాని కఠిన చర్యలవల్ల అణచటం సాధ్యమైన పనికాదనిరి. ఈ విషయాలను ఆలోచించి నిర్ణయించుటకు బిల్లును సెలెక్టు కమిటీకి ఆలోచనకు నివేదించవలెనని కోరిరి.

డా॥ తాజుద్దీన్‌గారు ప్రతిపాదనను బలపరచిరి.

శ్రీ ఆర్. సూర్యనారాయణరావుగారు వెనుక 1946 సం॥లో గావించిన యీ బిల్లు యిప్పటి పరిస్థితుల బట్టి కూడా అవసరమాయనే విషయము సభవారు ముఖ్యముగా ఆలోచించవలెననిరి. బిల్లులో తెలుపబడియున్నటువంటి అధికారములు ఎంతవరకు ప్రస్తుత స్థితిగతులనుసరించి ప్రభుత్వమునకు ఉండుట అవసరమనే సంగతి యోచించవలెనని అందువల్ల బిల్లును సెలెక్టు కమిటీకి నివేదించడం అవసరమని నుడివిరి.

శ్రీ యన్. రంగారెడ్డిగారు రైతులు ప్రభుత్వాధికారులు సూచించే పంటలనే పండించవలెనని నిర్బంధము పరచుటకు బిల్లులో నున్న మరకు ఆచరణలో పెట్టడం కష్ట సాధ్యమని అట్టి మరకు ప్రజల అసంతృప్తిని మరింత ఎక్కువ చేయునే గాని దాని వల్ల ప్రయోజనముండదనియు పలికిరి. వస్తువులపై కంట్రోల్లు విధింపనెంచితే అట్టి వస్తువులకు న్యాయమైన ధరలను నిర్ణయించితేనే కంట్రోళ్ళు సక్రమముగా నిర్వహించుటకు వీలగుననియు, అలాకాక పోతే కంట్రోళ్ళు నిరుపయోగమగుననియు నుడివిరి.

ప్రతిపక్ష నాయకుడు వి. కే. జాన్ గారు బిల్లులో తెలిపిన ఒకటి రెండు పదార్థములకు తప్పితే మ వాటికి ఇపలు కంట్రోల్లు ఉండుట అవసరమేలేదని అట్టి స్థితిలో ప్రస్తుతము అమలులోనుండే కంట్రోళ్ళన్నిటిని తొలగించుటకు బదులు ప్రభుత్వము యీ కంట్రోళ్ళ బిల్లును ఎందుకు శాసనము చేయదలచుచున్నదో అర్థంకాకున్నదనిరి.

### మంత్రి జవాబు

మంత్రి మాధవమీనన్ గారు విమర్శలకు బదులు చెప్పుచూ బిల్లులో తెలుపబడిన పదార్థముల జాబితా వెనుక 1946 సం॥లో పరిస్థితి బట్టి తయారుచేసిన మాటవాస్తవమే యనియు, వంటచెరకు, బొగ్గు, కొన్ని నేలసు వినుక కంట్రోల్లుండడము యిపుడు తొలగింపబడినవనియు, ఆ జాబితాలోగల కొన్నింటికి యింకా కంట్రోళ్ళున్నవనియు చెప్పిరి. వంటచెరకు పరిస్థితి యిపుడు తిరిగి కొంత ఆందోళనము కలిగించుచున్నదనియు ఆపదార్థములకు అవసరమైతే తిరిగి కంట్రోలు విధించుటకు వీలుగా నుండుటకే షెడ్యూలులో అట్టి పదార్థముల పేర్లు యింకా నుంచబడి యున్నవనియు పలికిరి. అవసర పదార్థాలను ప్రభుత్వము వశపరుచుకునే యెడల అట్టి ఉత్తర్వులవల్ల బాధకలిగినవారు దానిని ఆక్షేపిస్తూ కోర్టులలో దావా వేయకూడదని ఈ బిల్లులో ఎట్టి మరకు లేదనియు, పై ఉత్తర్వుల విషయమై కోర్టులు ఇంజక్షను ఉత్తర్వులు జారీచేయ వీల్లేదని మాత్రం నిషేధము కలదనియు పలికిరి.

ఆహారమంత్రి శ్రీ రోచ్ విక్టోరియా గారు బిల్లును సెలెక్టు కమిటీకి నివేదించవలెనను ప్రతిపాదనను ప్రభుత్వం అంగీకరింపజాలదని చెప్పుచూ అవసర పదార్థముల ధరలు పెచ్చుపెరిగిపోవుచున్నందున అట్టి వాటిని కంట్రోలు చేయుట అవసరమనిరి. బిల్లు సెలెక్టు కమిటీ ఆలోచనకు పెట్టవలెనని ఫకూకీగావించిన ప్రతిపాదనను సభవారు నిరాకరించిరి.

కవున్సిల్ మధ్యాహ్నం శ్రీ ఆర్. బి రామకృష్ణంరాజు గారి అధ్యక్షతను సమావేశమైనప్పుడు ప్రధాన వస్తువుల కంట్రోలుల బిల్లు మూడవసారి ఓటుకు పెట్టగా అంగీకరించబడెను.

తరువాత ఆహారమంత్రి ప్రధాన వస్తువుల కంట్రోలు బిల్లును శాసనముగా అంగీకరించవలెనని ప్రతిపాదనచేసిరి.

శ్రీ చలమాజీ గారు ప్రజలకు మంచి రకము బియ్యము సప్లయి చేయవలెననియు, గాలివలన కూరలకు కూడ ఇబ్బంది కల్గినందున బెంగుళూరు మొదలగు ప్రాంతములనుండి కూరలను సప్లయి చేయవలెననిరి.

శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు, భూమిని సారవంతమొనర్చుటకు ప్రభుత్వము ఏమీ చేయుటలేదనిరి. కంట్రోలువల్ల బాధపడేది బీదప్రజలు. అందువల్ల కంట్రోళ్ళను యెంత త్వరగా ఎత్తివేస్తే అంతమంచిదనిరి. ప్రతి జిల్లాలో ఒక ఎరువుల ఫాక్టరీని నిర్మించవలెననిరి.

జనాబ్ ఫరూకీ ఈ బిల్లును అమలుజరుపునప్పుడు జాగ్రత్తగా ఆలోచించి సానుభూతితో అమలుజరుపవలెననిరి.

శ్రీ ఆర్. సూర్యనారాయణరావుగారు యీ బిల్లులో అనవసరం, అప్రస్తుతము, నిరుపయోగమైన మరలు చాల వున్నవనిరి.

ఆహారమంత్రి చర్చకు సమాధానము ఇచ్చుచూ గిడ్డంగులు దగ్గరాలు గురించి చేసిన విమర్శను గురించి పరిశీలించెదమని అన్నారు. కోర్టుకు అప్పీలు లేకుండుట గురించి చెప్పుచూ ప్రతి చిన్న విషయము నకూ కోర్టుకు వెళ్ళకుండుటకుగాను కలెక్టరు వుత్తర్వులకై ప్రభుత్వమునకు అప్పీలు ఏర్పరచితిమనిరి. బిల్లు శాసనముగా అంగీకరించబడినది.

### జమీందారీశాసన పరిహార నిబంధనలు

మదరాసు, నవంబరు 18: రెవిన్యూ మంత్రి శ్రీ సీతారామరెడ్డిగారు నేడు కవున్సిలులో జమీందారీ రద్దుచట్టము సెక్షన్ 40 క్రింద జమీందార్లకు పరిహారము చెల్లించుటకు సంబంధించిన నియమములను ప్రతిపాదించిరి.

రెవిన్యూ మంత్రిగారు ముసాయిదా నియమములను వివరించిన తరువాత శ్రీ వి. కె. జాన్ మాటలాడుచూ జమీందార్లకు పరిహారమును వడ్డీవచ్చు ట్రాన్సఫరబుల్ బాండులలో చెల్లించవలెననియు, పరిహార మొత్తములో కొంత జమీందారీ రైతులనుండి వసూలు చేయవలెనని సూచించిరి.

శ్రీ భీమారావుగారు జమీందారీ రైతులనుండి జమీందార్లకు చెల్లించు పరిహారము మొత్తమున కనీసం కొంత మొత్తము వసూలుచేయుట న్యాయమనిరి.

ఆర్. సూర్యనారాయణ రావుగారు జమీందారులకు అసలు పరిహారమివ్వకూడదని వాదించిన వారిలో ఒకరమనిరి. 6½ కోట్లు జమీందార్ల చేతుల్లో పెడితే ధరలు పెరుగును. రెవెన్యూ రిజర్వునిధిని ముట్టుటకు వీలులేదు. అట్లని కేంద్రప్రభుత్వంగూడా వ్రాసినదనిరి.

మోతే నారాయణరావుగారు రైతులు ఎంతమాత్రం పరిహారం ఇచ్చుకోవలసిన అవసరము లేదనిరి. జమీందార్లకు ముందు కొంత పరిహారం ముట్టచెప్పవలెననిరి.

నారు రంగారెడ్డిగారు పరిహారము సందర్భమున చెన్నరాష్ట్రమునంతనూ ఒక్క ప్రాంతముగా చూడవలెననిరి. తురగా పురుషోత్తంగారు రైతులనుండి పరిహార అపరాధము వసూలు చేయరాదనిరి. ఆత్మకూరి గోవిందాచారిగారు జమీందార్లకు ఈ పరిహార మిచ్చినందుకు రెవెన్యూ మంత్రిని అభినందించిరి.

సభ్యుల విమర్శకు సమాధాన మిచ్చుచూ రెవిన్యూమంత్రిగారు ఈనియమములు సమగ్రపరిశీలన చేసినతరువాత చేయబడెననిరి. ఇందులో ధనవిషయముకంటె న్యాయము చేకూర్చుట ప్రధానము. పరిహారము చెల్లించుటగూర్చి చెప్పుచూ బాండులలో పరిహారమిచ్చు విషయం పరిశీలించబడెను. ఇంకనూ పరిశీలించబడుచున్నది, ఇది మంచిసూచన. ఈ విషయమై పరిశీలించుటకు సభవారికి ఎప్పుడూ అవకాశమున్నదనిరి. అంతటితో సభ 21 వ తేదీకి వాయిదా పడినది.

# జమీందార్లకుపరిహారంగా $12\frac{1}{2}$ కోట్లు

## సవరణబిల్లుకు భారతప్రభుత్వామోదం

మదరాసు, నవంబరు 18 : జమీందారీ రద్దు చట్టముక్రింద జమీందార్లకు సగం పరిహార మొత్తమును ముందుగా చెల్లించుటకున్నూ, మొత్తముమీద 12½ కోట్ల పరిహారము ఇచ్చుటకున్నూ సంబంధించిన సవరణబిల్లుకు ఇండియా ప్రభుత్వము అనుమతి ఇచ్చినట్లు తెలియుచున్నది. సవరణ బిల్లు బహుశా డిశెంబరులో అసెంబ్లీలో ప్రవేశపెట్టెదరు.

ప్రభుత్వము వశపరచుకొన్న 38 ఎస్టేట్లకు వెంటనే చెల్లించవలసిన మొత్తము పోటీన్నర రూపాయలవరకు వుండునని అంచనా వేయబడెను.

ఈ మొత్తము పెట్టుబడి వ్యయము క్రిందికి వచ్చును గనుక ప్రభుత్వ సెక్యూరిటీలను విక్రయించిగాని, ఋణంచేసిగాని చెల్లించవలసియుండునని భావించబడుచున్నది.

ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు విలేఖరులతో చెప్పించుచూ రెవిన్యూ ఖాతానుండి జమీందార్లకు పరిహారం ఇచ్చుటకు వీలు వుండదని అనిరి.

## ఎస్టేట్లలో శిస్తు తగ్గింపు

మదరాసు, నవంబరు 18 : ఎస్టేట్లలో జరిగిన శిస్తుతగ్గింపు పనిని సమీక్షించుటకు నేడు ప్రభుత్వ కార్యాలయములో సమావేశము జరిగెను. రెవిన్యూమంత్రి శ్రీ సీతారామరెడ్డి గారు అధ్యక్షత వహించిరి.

1950 మార్చి 31 లోగా శిస్తుతగ్గింపు పని పూర్తి కావలెనని లోగడ తీసుకొన్న నిర్ణయమును పునః ధృవపరచ్చూ ప్రకటించబడని ఎస్టేట్లలో శిస్తుతగ్గింపును గురించిన వివరములను చర్చించినట్లు తెలియుచున్నది.

### బస్సు స్టాండులలో సౌకర్యములు

#### స్థానిక సంస్థలకు ప్రభుత్వ తాకీదు

మదరాసు, నవంబరు 18 : బస్సుస్టాండు రుసుము వసూలుచేయుచున్న చోట్ల ప్రజలకు సౌకర్యములు చేయవలెనని మదరాసు ప్రభుత్వము మునిసిపాలిటీలు, పంచాయితీలకు సర్క్యులరు పంపియున్నది.

బస్సుస్టాండులలో ప్రయాణీకులు తిండిదాచుకొనుటకు వీల్లు చేయకుండా స్థానిక సంస్థలు కొన్ని రుసుము వసూలు చేయుచున్నవట.

## "జమీందారీ రైతులపై రుసుం వుండదు"

### కౌన్సిలులో రివిన్యూ మంత్రి ప్రకటన

మదరాసు, నవంబరు 18 : రాష్ట్రములో చిన్నవిగాని, పెద్దవిగాని మొత్తము జమీందారీలు 2810 వున్నవి. ఇందులో 38 ఎస్టేట్లను ప్రభుత్వము 1949 సెప్టెంబరులో వశపరచుకున్నది. మిగతా 2,777 ఎస్టేట్లను స్వాధీనపరచుకొనవలసి యున్నదని గురువారంనాడు కవున్సిలులో శ్రీ బి. భీమారావుగారి ప్రశ్నకు రెవిన్యూ మంత్రి వ్రాతపూర్వక సమాధానం ఇచ్చిరి.

ప్రతిజమీందారీ ఎస్టేటునుండి ప్రతి సంవత్సరమువచ్చే భూమిశిస్తు, చెల్లించవలసిన పరిహారము వివరములు సర్వే, సెటిల్‌మెంటు పూర్తి అయిన దరిమిలా తెలియును. కనుక ఈ వివరములు ఇచ్చుట సాధ్యము కాదని రెవిన్యూమంత్రి శ్రీ భీమారావుగారి ప్రశ్నకు సమాధానమిచ్చిరి.

#### ఈనాం గ్రామముల వివరములు

జమీందారీ రద్దుచట్టము సెక్షన్ 2 (7) క్రిందికివచ్చే ఈనాం ఎస్టేట్లకు మాత్రము వర్తించుననీ, సెక్షన్ (9) క్రింద నియమించబడు సెటిల్‌మెంటు ఆఫీసర్లు ఈనాం గ్రామములలో ఏవి ఈనాం ఎస్టేట్లో నిర్ణయించెదరని, ఈ సందర్భమున సెటిల్‌మెంటు ఆఫీసర్ల పరిశీలన పూర్తికావలందున గౌరవసభ్యుడు కోరిన భోగట్టా ఇచ్చుట సాధ్యంకాలేదని రివిన్యూమంత్రి శ్రీ సీతారామరెడ్డిగారు శ్రీ భీమారావుగారి ప్రశ్నకు వ్రాతపూర్వక సమాధానమిచ్చిరి. ఈనాం ఎస్టేటుకు ఇవ్వవలసిన పరిహారము, వచ్చే రివిన్యూ వివరములు సెటిల్‌మెంటు పూర్తి అయినాగాని తెలియవనిరి.

అదేసభ్యుని ప్రశ్నకు సమాధానమిచ్చుచూ జిరాయితీ రైతులనుండి పన్నుగాని, రుసుముగాని వసూలుచేయు ఉద్దేశ్యము లేదనికూడ రివిన్యూమంత్రి తెలిపిరి.

### రెవెన్యూమంత్రి

రెవెన్యూమంత్రి గౌ॥ శ్రీ. సీతారామరెడ్డిగారు 21 వ తేదీనే గోదావరి జిల్లాలకు సంచారం బయలుదేరెను. 1 మదరాసు తిరుగు 2 తేదీ బళ్లారి వెళ్లి 3 తిరిగినట్లుకు.

## భీమాకంపెనీల చట్ట సవరణ బిల్లు

### కొత్త మార్పులు

న్యూఢిల్లీ, నవంబర్ 18: 1938 వ సం॥ పు భీమా కంపెనీల చట్టాన్ని సవరించేనిమిత్తమై పార్లమెంటులో ప్రతిపాదన కాబోతున్న బిల్లు ఈవేళ ప్రకటించబడినది. ఇటువంటిబిల్లు ఒకటి 1948 జనవరిలోనే ప్రతిపాదించబడినది కాని జేకవిధ అనవిల్లనూ, తదితర మార్పులవల్లనూ అవసరమైన మార్పులను చేయుటానికి ఉపసంహరించుకోబడి, ఇన్సూరెన్సు సలహాసంఘంచేత సవరించబడి తిరిగి ఇప్పుడు ప్రతిపాదించబడినది.

కొత్తబిల్లులో ఈ కిందిమార్పులు ప్రధానంగా ఉన్నవి.

(1) భీమా కంపెనీల అధికారులు కంపెనీ ధనాన్ని దుర్వినియోగంచేయకుండా ప్రభుత్వంకంట్రోలుచేసేఅవకాశంకలిగినది

(2) బ్యాంకులకూ, భీమా కంపెనీలకూ సంబంధాలు పెట్టటాన్నిగురించి కొన్ని నిషేధాలు ప్రతిపాదించబడ్డవి.

(3) అనేక భీమా కంపెనీలలో ఒకే వ్యక్తి డైరెక్టరుగా ఉండటాన్ని, ప్రత్యేక పరిస్థితులలో తప్ప నిషేధించటమైనది.

(4) ప్రతి కంపెనీలోనూ కనీసం ఇద్దరు డైరెక్టర్లు పాలిసీ దార్లలోనుండి ఎన్నుకోవాలని నిర్ణయించబడినది.

(5) కంపెనీల నిర్వహణ ఖర్చులు, ప్రతినిధులకు, ఉద్యోగులకు, ఏజంట్లకు ఇచ్చే ప్రతిఫలం మొదలైనవి పరిమితపరచే అవకాశం కల్పించబడ్డది.

మొదటిఅంతాన్ని అనుసరించే నిమిత్తం ప్రభుత్వానికి కంపెనీల లెక్కలను పరిశీలించటానికీ, కంపెనీ ఆస్తులలో ఎన్నోవంతు ప్రభుత్వ సెక్యూరిటీలలో, ఎన్నోవంతును ప్రభుత్వామోదం పొందిన ఇతర సెక్యూరిటీలలో, ఎన్నోవంతును ప్రభుత్వామోదంపొందిన పెట్టుబడులలో పెట్టవచ్చునో ప్రభుత్వ నిర్ణయించటానికీ బిల్లులో వీలు కలిగించబడ్డది. ఇన్సూరెన్సే కాక ఇతర వ్యాపారాలనుచేసే కంపెనీల లైసెన్సును రద్దుచేసే అవకాశమూ, కొన్ని పరిస్థితులలో తిరిగి ఇచ్చే అవకాశమూ కలిగించ బడినది.

జీవిత భీమాకంపెనీ లన్నిటిలోనూ సామాన్య షేర్లు మాత్రమే ఉండాలనీ వోటుచేసేహక్కు చెల్లించబడిన ధనాన్ని పట్టి ఉండాలనీ నిర్ణయించబడినది.

జాయింట్ స్టాక్ ఇన్సూరెన్సు కంపెనీలు మ్యూచువల్ కంపెనీలుగా మారటానికి చేయవలసిన తతంగం సులభం చేయబడ్డది. మ్యూచువల్ కంపెనీలలో పాలిసీ దార్లు వాటాదార్లుగాకూడా పరిగణించబడతారు. ప్రజలకు కొన్ని వాటాలను ప్రత్యేకించే పబ్లిక్ కంపెనీలూ, సహకార సంఘాలూ మాత్రమే భీమా వ్యాపారాన్ని చేయవలెననికూడా నిర్దేశించబడినది.

## హేగ్ ఒప్పందం

### రిపబ్లికన్ మంత్రి వర్గామోదం

బటేవియా, నవంబరు 18: ఇండొనీషియా రిపబ్లిక్ మంత్రివర్గం హేగ్ ఒడంబడికను ఆమోదించిందనీ, ఒడంబడికను ధ్రువపరచడానికి డిసెంబరు 6 వ తేదీన పార్లమెంటు సర్వసభ్యసమావేశం జరపబడుతుందనీ జోగ్జకర్తా రేడియో ఈ వేళ ప్రకటించింది.

పార్లమెంటు రిపబ్లికన్ పార్టీకి అధ్యక్షుడైన డా॥ మహమ్మద్ అస్సాత్ అధ్యక్షతన ప్రత్యేక మంత్రివర్గ సమావేశం జరిగిందనీ, ఈ సమావేశంలో హేగ్ ఒడంబడికను కూలంకషంగా పరిశీలించి ఆమోదించడమైనదనీ, రేడియో వెల్లడించింది. రిపబ్లిక్‌లోని రాజకీయపక్షా లన్నిటిలోకి పెద్దదైన ముస్లింపార్టీ కూడా ఒడంబడికను ఆమోదించిందని ఈ వేళ తెలియవచ్చింది; రిపబ్లికన్ పార్లమెంటు ఇక ఒడంబడికను ఆమోదించడం తథ్యమని, ఈ వార్త తెలిసిన తర్వాత అందరూ అనుకుంటున్నారు.

## ఇండొనీషియాకు ఋణం

న్యూయార్కు, నవంబరు 18: ఇండొనీషియా అమెరికా ఎగుమతి దిగుమతి బాంకును డిసెంబరు మాసాంతంలో 10 కోట్ల డాలర్ల అప్పుఅడుగుతుందని న్యూయార్కు వాణిజ్య పత్రిక వ్రాసింది. అమెరికాలోని ఇండొనీషియా మంత్రి డా॥ సుమిత్రో గాను విదేశాంగ శాఖ ఉద్యోగులతో ఈ ఋణం విషయమై సంప్రతింపులు జరిపిరినసీ, ఎగుమతి దిగుమతి బాంకు ఉద్యోగులతోకూడా త్వరలోనే సమాలోచనలు జరపగలనని చెప్పెను.

## తిరుపతి పురపాలకసంఘ ఉప ఎన్నిక

తిరుపతి, నవంబరు 18:

నిన్నటిదినం తిరుపతి పురపాలక సంఘపు 12 వ వార్డుకు ఉపఎన్నిక జరిగినది. పి. దాసమునిరెడ్డిగారికి 175 వోట్లున్నూ, వారికి పోటీగా నిలిచిన అభ్యర్థికి 110 వోట్లున్నూ వచ్చినవి. కనుక పి. దాసమునిరెడ్డిగారే ఎన్నుకోబడినారని తెలుపబడినది. (స్వ. వి.)

మధ్య, దూరప్రాచ్యంలో పర్యటనచేస్తూ నవంబరు 16 న ఢిల్లీ చేరిన 4 గురు అమెరికన్ సెనేటర్లకు అమెరికా రాయబార కార్యాలయంవారు పలాం విమానాశ్రయంవద్ద స్వాగతమిచ్చిన సందర్భంలో తీయబడిన చిత్రం.

## ఆంధ్రరాష్ట్ర సహకార మహాసభ

### పప్పూరి రామాచార్యులు గారి స్వాగతోపన్యాసం

అనంతపురం, నవంబరు 19: నేడిక్కడ ప్రారంభమైన ఆంధ్రరాష్ట్ర సహకార మహాసభలో ఆహ్వాన సంఘాధ్యక్షులు పప్పూరి రామాచార్యులుగారు ప్రతినిధులకు పెద్దలకు స్వాగతం చెబుతూయిట్లు ప్రసంగించిరి.

ఆంధ్రదేశ సహకార మహాసభ గతయేడు తూర్పు సీమాంతమున కంచిలిలో జరిగినది. ఈ యేడు పశ్చిమపు సరిహద్దులో జరుప దలంచుకొన్న నాయకుల ఉద్దేశ్యము ఆంధ్రదేశ సహకారులు ఈరాష్ట్ర వైశాల్యమును గుర్తించి దూరమున నున్న తెనుగు సోదరుల పరిచయము బడయుదురు ననియేనని ఊహించుచున్నాము.

మొన్నటి తుపానుబాధ పడకున్న యెడల చాలమంది సహకారులు ఈసభకు వచ్చియుండెడివారే. కాని ఈజలప్రళయ వార్తలు నానాటికి పెరిగివచ్చి మనస్సున కాందోళనము గూర్చుచున్నందున చాలమంది ఈ దూరప్రయాణమును మానుకొనియుందురు. కోస్తా జిల్లాలకు అతివృష్టి బాధయును రాయలసీమకు అనావృష్టి బాధయు మాటిమాటికిని తప్పని వగుచున్నవి. ఇవి ప్రకృతి విపర్యములనుకొని, అనుభవించుట మన కర్మయనిభావించి యూరకొనరాదు. ప్రకృతిని జయించుట మానవకర్తవ్యము. ప్రజలును ప్రభుత్వమును సహకరించి పనిచేసినతప్ప ఈ ఈతిబాధలను తప్పించుకోజాలము.

అతివృష్టి అనావృష్టులవలెనే ఆర్థిక ప్రపంచములో డివాల్యుయేషన్ రివాల్యుయేషన్ ఒడిదుడుకులు సంభవించుచున్నవి. 1930 లో వచ్చిన ఆర్థిక దుర్దశలో రైతులేగాదు సహకార సంఘములుగూడ చాల దెబ్బతిన్నవి. కాని యుద్ధసమయమున పెరిగిన ధరలవలన రైతులు వెకటి బాకీలను తీర్చుకొని కొంత బాగుపడిరి. సహకారసంఘములును తేరుకొన్నవి. ఇంతలో మరల అకస్మికమగు ఆర్థికమాంద్య మేర్పడినది. దీని లోతుపాతులింకను గోచరముకుటలేదు. కాని ఒక్కొక్కరికిని డబ్బుతో ఇక్కట్టు ఏర్పడినది. సహకార సంఘములు వేలు లక్షలు ఋణములోగుచున్నవి. సెంట్రల్ బ్యాంకులలో డబ్బులేదు. రాష్ట్ర సహకారబ్యాంకులలో గూడ ఉన్నధనము చాలకవచ్చినది. ప్రభుత్వముగూడ ఈ అక్కరల నాదుకొనజాలకున్నది.

భారతప్రభుత్వము వ్యయమును తగ్గించుకొనెను. బ్రిటన్ గూడ డబ్బులేక తబ్బిబ్బుపడుట చూచుచున్నాము. ఒక్క అమెరికాలో ధనము పుష్కలముగా నున్నదని యూహింపవచ్చును. రష్యా ధనవంతమైనది కాకపోయినను దారిద్ర్యములో నున్నట్లు కనుబడదు. ఇందుకు కారణము అచటి ప్రభుత్వ సాంఘిక సంస్కరణా విధానమేమో! అట్లని కమ్యూనిస్టు పద్ధతులు మంచివని చెప్పరాలేదు. కమ్యూనిజం నియమములు సహకార సిద్ధాంతములమీద యేర్పడినవి. కాని రష్యాలోని ఆ సహకార పద్ధతి నిర్బంధ విధానముమీద నాధారపడినది. విప్లవము దాని స్వరూపము, హింస దానికి సాధనము. కాని మనదేశ సహకారపద్ధతి యిట్టిదికాదు. సంఘములో సంఘసభ్యులకు గల మంచిని యిది సాధించి దాని అభివృద్ధికి ప్రయత్నించు ఉద్దేశము మనది ఐచ్ఛిక సహకారమే గాని నిర్బంధశాసనములు మనకు ఆధారములుగావు. హింస మనకు సాధనము కానేకాదు. ఇది ప్రజాసహకారపద్ధతి. అది,నియంతృ సహకారపద్ధతి. మన దేశములోను కమ్యూనిస్టులరావిడి హెచ్చుచున్నదని ప్రభుత్వమువారు దాని నణచుటకు నిర్బంధశాసనములు గావించినారు. ఇది దానికి ప్రతిక్రియయగునో కాదో భవిష్యత్కాలము పరిశీలించి తీర్మానించగలదు.

కాని సహకార సూత్రముల ననుసరించి పని చేసినచో అట్టి విప్లవోద్యమముల కవకాశము ఏర్పడదని మాత్రము గట్టిగా చెప్పవచ్చును. మన దేశమున సహకారోద్యమము నలువది ఏండ్లుగా పని చేయుచున్నను ప్రజల మనసు నాకర్షింపలేకున్నది. ఇటీవల మద్రాసు ప్రభుత్వము దాని వ్యాప్తిని హెచ్చుచేయ ప్రయత్నించుచున్నది. ప్రతియూరికొక సంఘము, ప్రతిఇంటికొక సభ్యుడు అనునది ప్రభుత్వాధికారుల గరిష్టాశయముగా ప్రకటింపబడినది. కాని ఉన్న సంఘములకే ఆర్థిక సహాయ్యము చేయలేని స్థితిలో క్రొత్తసంఘములు క్రొత్త సభ్యులను చేర్పుటవలన ప్రజలకు ఈ ఉద్యమము మీద విశ్వాసము హెచ్చునా తగ్గునా అనునది సహకారు లాలోచింపవలసిన ముఖ్య సమస్య.

రాష్ట్రబ్యాంకు సెంట్రల్ బ్యాంకులకు అల్పకాలపు ఋణములనే ఇచ్చుచున్నది. ప్రాథమిక సంఘములు కోరునది మధ్యకాల దీర్ఘకాల ఋణములు. రైతులు మాసవేతనములు గలవారు కారు. అందునను రాయలసీమ వ్యవసాయము వర్షముమీద నాధారపడినది. మూడేండ్ల కొక్కసారి మాత్రమే పంటలుపండును. అట్టి సందర్భములలో ఏడాది పదినెల్లు వాయిదాలతో ఋణము తీసికొన్న రైతు సభ్యులు వాయిదా తప్పకుండ అప్పుతీర్పలేరు. బకాయిపడిన సంఘములకు మరల ఋణమబ్బదు. ఇట్టిపరిస్థితిలో ప్రాథమిక సంఘములు ఋణముతీసికొన జంకుచున్నవి. సెంట్రల్ బ్యాంకులు వానికి ఋణమియ్యలేవు, ఇయ్యకుండనూ ఉండజాలవు. ఏమన, అల్పకాల వాయిదాలో అప్పు తెచ్చి సెంట్రలు బ్యాంకులు దీర్ఘకాల వాయిదాలో ప్రాథమిక సంఘములకిచ్చుట ప్రమాదకరము. ఋణములే ఇయ్యకున్నచో బ్యాంకులుండి ప్రయోజనము లేదు. ఈ విషమసమస్యను ఎట్లా పరిష్కరించవలెనో ఈమహాసభ ఆలోచింప వలసి యున్నది.

ఇటీవల రకరకములగు సహకార సంఘములు సృష్టింపబడుచున్నవి. చేనేతవస్త్రోత్పత్తి సంఘములు, గృహనిర్మాణ సంఘములు, టోకువ్యాపార సంఘములు,స్టోర్సు సంఘములు, గాజులు, చాపలు, చేపల ఉత్పత్తి సంఘములు, లేబరుకంట్రాక్టు సంఘములు, ఈతబెల్లము నుత్పత్తిచేయు సంఘములు, మార్కెటింగు సంఘములు, మొదలగునవి. ఇవిగాక సకలార్థ సంఘములు కొన్ని. అన్ని సంఘములను సకలార్థసంఘములుగా మార్చునది ప్రభుత్వాశయమట!

ఎన్నియున్నను రైతునకు ముఖ్యముగా ఉపయోగపడుచున్నవి పరపతిసంఘాలే. తక్కినవానిలో అనేకములు అలంకార ప్రాయములు. ఆ పరపతిసంఘములు కావలసినంత ఋణమును బడయలేక జలములేని రాయలసీమ నదులవలె అనల్పమగు ప్రయాసతో అల్ప లాభమును కొందరికిమాత్రమే చేకూర్పవ ట్టివనుచున్నవి. ఇట్టి సందర్భములలో ఈ యుద్యమము సార్థకవంతముగు ప్రయోజకరముగుచేయుట ఎట్లో సహకారు లాలోచింపవలెను. రాయలసీమలో రయితులకు చౌక వడ్డీతో ఋణములనిచ్చు నిమిత్తము ప్రభుత్వం 1% వడ్డీ సబ్సిడీగా ఇచ్చుటకు అంగీకరించినట్లు ఉత్తర్వుల నంపినది. ఇందుకొరకు గవర్నమెంటు ఇద్దరిని డైరెక్టరులుగా బ్యాంకులకు నామినేట్ చేయగలదట. అధికముగా పైలాను అంగీకరించవలసినదిగా సెంట్రల్ బ్యాంకులకు తాఖీదు వచ్చినది. ఈ ఆలోచనలు జరిగి ఇంచుమించు రెండేండ్లయినవి. కాని అప్పటికిని ఇప్పటికిని కాలము మారిపోయినది. ఇప్పుడు ఎవ్వరికిని రూపాయికి తక్కువగా వడ్డీ దొరకదు. కావున మాయూలు మేరకు సొసైటీ లిచ్చు అర్ధరూపాయి రేటు హెచ్చుగా కనుబడదు. వడ్డీరేటు తగ్గించుటకంటె మధ్యకాలపు దీర్ఘకాలపు ఋణములు లభించుటయే రాయలసీమ రైతులకు కావలసినది. తక్కువ వడ్డీకి స్వల్పకాలపు వాయిదా లిచ్చుటయు దానిని సకాలములో తీర్పలేక సభ్యులు మరల సాహుకారులవద్ద హెచ్చు వడ్డీకి ఋణము తెచ్చి సొసైటీల కిచ్చుటయు సంభవింపగలదు. ఇందువలన గవర్నమెంటుకు సబ్సిడీ మొత్తము నష్టమును సెంట్రల్ బ్యాంకులకు 1% పర్సెంటు లాభము చాలని కష్టమునుతప్ప రైతులకగు లాభము పూజ్యము. ద్రవ్యాభావము కలిగిన ఈ రోజులలో గవర్నమెంటు సబ్సిడీ ఇయ్యకున్న మూడు పర్సెంట్ల వడ్డీతో సెంట్రలు బ్యాంకులకు కావలసినధనము నందియ్య గలిగినచో ఎంతో ఉపకారము చేసినట్లగును. కావున ఈ జిల్లా సెంట్రలుబ్యాంకు డైరెక్టరులు ఈ స్కీము నామోదించలేదు. గవర్నమెంటు సబ్సిడీ ఇచ్చినంత మాత్రమున నామినేటెడ్ డైరెక్టరు లెందుకు నియమింపబడవలెనో అర్థము కాకున్నది. ఇనుకటి ప్రభుత్వపు అడుగు జాడ లీ సలహాలో గోచరముచున్నవి.

సహకారోద్యమము పెరుగుదల కనుగుణముగా రాష్ట్ర బ్యాంకులుగాని ప్రభుత్వముగానీ ధనము నందియ్యజాలవు. మార్కెట్టులో వడ్డీరేటు హెచ్చినందున తక్కువ వడ్డీలకు బ్యాంకులలో కలవారు నిలవచేయరు. వున్న నిలవలనే వాపసు తీసికొనుచున్నారు. ఈ విషయమునుగూడ మహాసభవారాలోచించి ముందు దీర్ఘకాలపు వాయిదాలకు ఋణము లబ్బువిధానము నాలోచింపవలసియున్నది. నాకు జూడ ప్రయివేటు బ్యాంకింగుపద్ధతిని అనగా ఎవరికి వారు ఇతరులకు వడ్డీకి అప్పలిచ్చుపద్ధతిని నిషేధించి ఈ వ్యాపారమంతయు బ్యాంకులమూలముననూ సహకార సంఘముల మూలమునను జరిపింపదగు శాసనములను గవర్నమెంటు చేయుట మంచిది. నిర్ణీతకాల చిన్నబ్యాంకును స్థాపించి రూ 500 కు మించిన రొక్కమంతయు బ్యాంకులలోతప్ప ఇంట నిలువ చేయరాదనికూడ, శాసించవలయును. ఈ నిలవల విషయము బ్యాంకులు అతిరహస్యముగా నుంచవలెను. అట్లు చేసినచో ఇప్పుడు నిలువయున్న ధనమంతయు బ్యాంకులకువచ్చి చలామణిలో నుండగలదు. ఇప్పుడు కృత్రిమముగా ఏర్పడిన ధనలోప మంతరించగలదు."

### రివిన్యూమంత్రి

మదరాసు,నవంబరు 19: రివిన్యూమంత్రి శ్రీ హాలాహర్వి సీతారామరెడ్డిగారు శాసన సభా సమావేశము పూర్తిఅయిన పిమ్మట వరదలపాలు దెబ్బతిన్న ప్రాంతములలో పర్యటించ నున్నారని సభానాయకుడు శ్రీ గోపాలరెడ్డిగారు నేడు అసెంబ్లీలో శ్రీ జి. సన్యాసిరావుగారి ప్రశ్నకు జవాబు ఇచ్చిరి.

### ముష్టియుద్ధములో మరణం

యస్. ఐ. ఎ. ఎ. మైదానములో నవంబరు 6 తేదిన ముష్టియుద్ధ పోటీలో ఒకడు మరణించెననియూ, తగినంత ముఖ్య వర్తి లేనందున మరణం సంభవించ లేదని ఇకముందు ఇటువంటివి సంభవించకుండా ప్రభుత్వము చర్యలు తీసుకొనుచున్నదనీ, ముష్టియుద్ధ ప్రదర్శనమున పాల్గొనువారు ఇకముందు డాక్టరునుండి అర్హత సర్టిఫికెటు పొందవలెనను షరతు విధించబడినదని నేడు అసెంబ్లీలో శ్రీ కె.టి. కోసల్‌రామ్ ప్రశ్నకు, ప్రధానికి బదులుగా సభానాయకుడు జవాబు ఇచ్చిరి.

## సింహళ సమావేశంలో జరుగగల చర్చలు

లండను, నవంబరు 18: రాగల జనవరిలో సింహళంలో జరిగే కామన్వెల్తు విదేశాంగమంత్రుల సమావేశంలో పరస్పర విదేశాంగ విధానాలకు అనుబంధించే ఆర్థిక విషయాలూ, ఇతర రాజకీయ విషయాలూ చర్చించబడగలవని పార్లమెంటువర్గాల ద్వారా తెలుస్తున్నది.

బెవిను నాయకత్వాన సమావేశంలో పాల్గొనే బ్రిటిషు ప్రతినిధివర్గం వెంట అనేకమంది ఖజానా అధికార్లుంటారని నమ్మకంగా తెలుస్తున్నది.

కొంతకాలం క్రితం లండనులో జరిగిన కామన్వెల్తు ఆర్థికమంత్రుల సమావేశంలో చర్చించబడిన విషయాలే తిరిగి చర్చకు రావనీ, విదేశీ విధానాలకు సంబంధించిన ఆర్థికవిషయాలుమాత్రమే చర్చించబడతవనీ భావించబడుతున్నది.

విమానయానం సరిపడని కారణంచేత బెవిన్ సముద్రయానంచేసి కొలంబో చేరుతారు. జనవరి 26 న నూతనభారతరాజ్యాంగం అమలుజరిగేసందర్భంలో బ్రిటిషుప్రతినిధివర్గంవారు సింహళంనుంచి ఇండియాకు పోతారో లేదో తెలియడంలేదు.

బెవిను వెంట కామన్వెల్తు సంబంధాల కార్యదర్శి పి. జె. నోయెల్ బేకర్ కూడా కొలంబో వెళుతున్నారు. ఇతర ప్రతినిధులపేర్లు రెండువారాలలోగా ప్రకటితం కాగలవు.

జపాను శాంతి ఒడంబడిక కూడా చర్చించ బడుతుందని భావించబడుతున్నది. ... జపాను శాంతి ఒప్పందం ... ముఖ్య జరిగే మంతనాల ఫలితంగా అందరికీ ఆమోదకరమైన ఒడంబడిక ముసాయిదాతయారయ్యే వరకూ పశ్చిమ రాజ్యాలు దానిపై చర్చలు జరపడం జరగదని తెలుస్తున్నది.

జపానుసంధి ముసాయిదా తయారు చేస్తున్నామని అమెరికా ప్రభుత్వశాఖ ఆదివరకే ప్రకటించింది. ఇది సిద్ధమయే పక్షంలో సింహళ సమావేశంలో తప్పక చర్చకు రావచ్చును.

సింహళ సమావేశంలో ప్రధానంగా చర్చించబడే మరొకసమస్య పైనాకమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించడం. దీనిని గురించి కామన్వెల్తు దేశాలు ఆదివరకే చర్చలు జరుపుతున్నవి.

### ఇండియా సమ్మతి

న్యూఢిల్లీ, నవంబర్ 18: 1950 ఆరంభంలో కొలంబోలో ఏర్పాటు అవుతున్న కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సమావేశానికి రావలసిందని సింహళ ప్రభుత్వం వారు పంపిన ఆహ్వానాన్ని ఇండియా ప్రభుత్వం స్వీకరించిందని అధికార రీత్యా ఇక్కడ తెలుపబడింది.

సమావేశం జరిగే తేదీ తనకు వీలుగా ఉన్నట్టయితే సమావేశానికి హాజరు కావడానికి ప్రధాని పండిట్ నెహ్రూ ప్రయత్నిస్తారు.

కెనడా, నవంబరు 18: సిలోన్‌లో జరిగే కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సమావేశానికి కెనడా హాజరౌతుందని విదేశాంగ మంత్రి లెస్టర్ పియర్సన్ నేడుపార్లమెంటులో ప్రకటించారు.

## గంటల పంచాంగం

విరోధి సం॥ కార్తీక బ॥ అమా॥
1949 సం॥ నవం॥ 20 ఆదివారం
ఆ॥ అమావాస్య ప 1.3 విశా ప 11-10
వర్జ్యం ప 2.44 ల 4-10 వ.

మార్గశిరమాసము
శు॥ ప్రథమ నవం॥ 21 సోమవారం
పా॥ ప్రథమ ప 9.48 అను ప 8.37 వర్జ్యం ప 1.43 ల 3.10 వ.

ఆంధ్రపత్రిక
విరోధి సం॥ కార్తీక బ॥ అమా॥
ఆదివారం

# తొందర అనవసరము

ఆంధ్రరాష్ట్రము ఇక శరవేగముతో రానున్నది. 1950 సం॥ జనవరి 26 లోపున ఏర్పడవలసి యున్నది. కాబట్టి అంతకు చాలాముందే గవర్నరు జనరలు ఆర్డరు ఇన్‌కౌన్సిలు జారీ కావలసి యున్నది. బుధవారము కాంగ్రెసు కార్యవర్గ తీర్మానము వెలువడినవెంటనే కార్యదర్శి కళా వెంకటరావుగారు ఆర్డర్ ఇన్‌కౌన్సిలు దాదాపు కొన్నివారములలో రావచ్చుననిరి. మద్రాసు రాజకీయవర్గములు ఒక వారములోనే రావచ్చునని భావించుచున్నారు.

మరి వారము రోజులలో కాకపోయినా త్వరలోనే ఆర్డర్ ఇన్‌కౌన్సిలు రాకతప్పదు. ఆంధ్ర ప్రాంతము విభజింపబడి, రాష్ట్రముగా ఏర్పడక తప్పదు. ఆ విషయమై ఇక ఆందోళనలు, విన్నపములు అనవసరము. మిగిలిన అంశముల మీదనే దృష్టిని కేంద్రీకరించుట అవసరము.

ఆర్థిక మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు చెప్పినట్లు "రాష్ట్ర నిర్మాణ పూర్వమెంతో తతంగము జరుగవలసి ఉన్నది. తొందరపడక స్థిమితముగా ఈ వ్యవహారము జరుగవలసి యున్నది." గోపాలరెడ్డిగారు చెప్పినది ఆవేశోత్సాహ రహితమైనదిగా కనుపడవచ్చును. కాని అందరు జాగ్రత్తగ గమనింపవలసిన విషయము. విభజన అనునది ఆదరాబాదరగా జరుగుట ఏమాత్రము శ్రేయస్కరము కాదు. విభజనతోపాటు అనేక విషయములు తేలవలసియున్నది. అర్థాంతరముగా విభజన జరుగుటతో పాకిస్తానుతో తరువాత ఎన్నిచిక్కులు ఏర్పడినవో అందరికీ తెలిసినవిషయము. విభజన అనునది బహు తేలిక, కాని దానితోబాటు జరుగవలసిన పంపకములు అనేక మున్నవి. ఆస్తులు, అప్పుల పంపకము జరుగవలసియున్నది. ఉద్యోగులను పంచుకోటము జరుగవలసి యున్నది. దాదాపు అంతా కొత్త సంసారము కాబట్టి "విభజన అవటం ఎల్లాగూ నిశ్చయింపబడినది కాబట్టి ఎంత శీఘ్రముగా విభజన జరిగితే అంతమంచిదే" అను మాటలు కట్టిపెట్టి విభజనతోపాటు జరుగవలసిన ఇతర తతంగమునుగురించి ఆలోచించుట అవసరము. ఇక విభజన జరుగదని అనుమానము లేదు కదా? 1950 జనవరి 26 కు ఎలాగు ఆంధ్రరాష్ట్రము వ్యవహారములో నుండగలదు. ఈ లోపున ఇంకనూ ఆందోళన ఎందుకు?

మదరాసును వదలు విషయముకూడ కొందరు అనవసర తొందరపాటును ప్రదర్శించుచున్నారు. "మద్రాసు మనది కాదని తెలిసినాక కూడ ఆంధ్ర ప్రభుత్వం మద్రాసులోనే వుండడం అంత సవ్యంగాదు" అని గౌ॥ నీలం సంజీవరెడ్డిగారు సూచించిరి. మొన్న, మొన్నటివరకు గౌ॥ సంజీవరెడ్డిగారు మద్రాసు రాజధానిగాని ఆంధ్రరాష్ట్రం అక్కరలేదనిరి. ఇపుడు వారే ఇంత తొందరగ మద్రాసునుండి ఎంత శీఘ్రముగా వెడలిపోయిన అంతరికీ మంచిదనుట ఆశ్చర్యముగ కనుపడకమానదు. ఇంత తొందరకు కారణమేమో బోధపడలేదు. మద్రాసు ఆంధ్రరాష్ట్రంలో చేరదనుమాట తేలిపదిగాని, అది ఫలానివారికి చెందనున్నదని స్థిరపడలేదుకదా? అయినా అది ప్రత్యేకరాష్ట్రముగా ఏర్పడవలెనని సూచించినపుడు ముందు దానిని వదలిపోవుటలో ఔచిత్యము కనుపడదు. ఆంధ్రరాష్ట్రములో చేరనక్కరలేదని చెప్పుటే జరిగినదిగాని, నగరముపై అసలు హక్కులు వదలుకొందుమని చెప్పలేదుకదా? కాబట్టి మద్రాసు భవిష్యత్తు తేలువరకు మద్రాసును వదలిపోవుట అంత ఉత్తమము కాదు. అంతేకాక ఆచరణదృష్ట్యాకూడ విషయమును ఆలోచించుట అవసరము. రాజధాని అన్వేషణ నిర్ణయము అనునది పెద్దసమస్య కాదు. అనవసర అనుమానములు లేకపోయిన ఆ ప్రదేశమును తేలికగ నిర్ణయింపవచ్చును. కాని ప్రదేశమును నిర్ణయించినంత మాత్రమున వెంటనే అక్కడికి తరలిపోవుట సాధ్యమైన కార్యమా? దాననిర్మాణము ఒక్క రోజులో గాని, ఒక్క సంవత్సరములోగాని జరుగునది కాదు. దానిని గమనింపక త్వరలో వెళ్లిపోవుద మనుట ఉచితము కాదు. గవర్నరు జనరలు ప్రకటించు ఆర్డరులో తాత్కాలిక రాజధానినిగురించి చెప్పుట జరుగును. మద్రాసు ఉభయులకు రాజధానిగ నుండగలదని చెప్పవచ్చును. వారు వ్యవధి తక్కువ ఇచ్చెదరేమోనని భయపడుచుండ ఈ ప్రసంగములను గమనించిన ఇక్కడనుండి ఎంత త్వరగాబడితే అంత త్వరగా వెళ్లుటకు వారు సర్వాటు చేయుదురు. ఆంధ్రులను త్వరగా వెళ్లిపొమ్మని చెప్పుటకు అరవలకు వీలుగానుండును. అట్టి పరిస్థితి రాకుండగ చూడవలెను. ప్రస్తుతము జాగ్రత్తగ చూడవలసినది రాజధాని అన్వేషణ కాదు. విభజనకు సంబంధించినఅన్ని విషయములందు అప్రమత్తత వహించుట. రాజధాని అన్వేషణ నెమ్మదిగా జరుపవచ్చును.

అసలు విభజనకు సంబంధించిన సమస్యలు పరిష్కారము కాకమునుపు, మద్రాసు భవిష్యత్తు తేలకమునుపే రాజధానినిగురించి ఎత్తుకొనుట అంత మంచిది కాదు. అందులో శ్రీబాగు పాక్టును గురించి అప్పుడే ఎత్తుకొనుటఅంతకన్న మంచిది కాదు. రాష్ట్రము ఏర్పడి ఇంకా వ్యవహరింపకమునుపే ఇప్పటినుంచీ, కలతలు ఆందోళన ఆరంభమగును. ఇతరులు నవ్వుటకు ఆస్కారమేర్పడును. రానున్న రాష్ట్రమునకు స్థాయిచిక్కు విషయముల గురించే ఇపు డాలోచించవలసియున్నది.

## కీ॥ శే॥ ధవళ సుబ్రహ్మణ్య శాస్త్రి గారు

విజయనగరం, నవంబరు 18: బ్రహ్మశ్రీ ధవళ సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మొన్న 14-11-49 సోమవారంనాడు బళ్ళారి ప్రాంతములో, తమ 75 వ ఏట దివంగతులైరని వ్రాయుటకు చింతిల్లుచున్నాము.

# మాచ్‌ఖండ్ ప్రాజెక్టుకు అంతరాయం కలుగదు

## అసెంబ్లీలో ఆర్థికమంత్రి సమాధానం

చెన్నపట్నం, నవంబరు 19: మాచ్‌ఖండ్ ప్రాజెక్టుకు వివిధంగానూ దేశంలో ఇప్పుడు ఏర్పడిన మారక పరిస్థితివల్ల అంతరాయం కలుగదని మద్రాసు ప్రభుత్వ ఆర్థికమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు యుద్ధానంతర కార్యక్రమాల సందర్భమున నేడు అసెంబ్లీలో వచ్చిన ప్రశ్నకు సమాధానముగా తెలిపిరి.

యుద్ధానంతర కార్యక్రమము మార్పువిషయము ప్రభుత్వమువారి ఆలోచనలో ఉన్నదని నివర్తి వెంకటసుబ్బయ్యగారికి సమాధానముగా ఆర్థికమంత్రి తెలిపిరి. కేంద్ర ప్రభుత్వంవారు పొదుపునకు కొన్నిసూచనలు చేసిరనియు అవి కూడా ప్రభుత్వంవారి ఆలోచనలో ఉన్నవనియు, ఇర్రిగేషను, ఎలెక్ట్రిసిటీ ప్రణాళికలను తగ్గించు ఉద్దేశ్యం లేదనిరి. ధరలప్రమాణం ప్రభుత్వ ఉత్తర్వులకు లోంగునదిగాదనిరి. రామపాదసాగరం ఇందువల్లనే ఆపినారా?, అనగా రామపాద సాగరం ప్రాజెక్టు ప్రారంభించనవారికి గాని, ప్రారంభించకుండుటకుగాని ఇప్పటి ఆర్థికపరిస్థితికి సంబంధములేదనిరి. మాచ్‌ఖండ్ ప్రాజెక్టుకు అంతరాయం కలుగునని తామనుకొనుట లేదనిరి.

హైకోర్టుకు మొత్తంపై 198 నుంచి 200 రోజులవరకు సెలవలు ఉన్నవని లాశాఖామంత్రి మాధవమీనన్‌గారు బేగం అమీరుద్దీన్‌గారికి తెలిపిరి. ఉపప్రశ్నలకు సమాధానముగా ఇకముందుకూడా సుక్రవారంగాక ఆదివారమే సెలవదినంగా పరిగణింతురనియు, శనివారం జిల్లాకోర్టుమున సబుకోర్టులకు సెలవుఇచ్చు విషయం నిర్ణయించవలసినది హైకోర్టేననిరి.

గ్రంథాలయాలచట్టం నిబంధనలు తయారుచేయబడినవనియు, పూర్తి అయిన వెంటనే అమలు చేయబడునినియు విద్యామంత్రి వేదరత్నం పిళ్ళెగారికి సమాధానముగా తెలిపిరి.

వినుదలైపత్రికనుంచి ప్రభుత్వంవారు ధరావతు కోరినారనియు, ధరావతు కట్టబడెననియు, సంపాదకుల సలహాసంఘము వారు దీని కనుమతించిరనియు, ఆపత్రికను ప్రభుత్వసహాయ గ్రంథాలయాలకు సరఫరాగావించు విషయము ఇప్పుడు ఆలోచింపబనిలేదనియు సర్దార్ వేదరత్నంపిళ్ళెగారికి సమాధానంగా లాశాఖామంత్రి తెలిపిరి.

నీలాంబూరులో పసువులకు వీనునుకు జబ్బుచేసి, రెండు ఏనుగులు చచ్చిపోయినందున ఏనుగ లన్నిటికి టీకాలు వేయబడెనని, అహ్మద్‌కట్టిగారికి వ్యవసాయ మంత్రి ఎ. బి. శెట్టిగారు తెలిపిరి. ఏనుగు బ్రతికి ఉన్నా, చచ్చినా వెయ్యిరూపాయలనే సామెక ఉండగా వాటికి టీకాలకు ఎందుకు ఖర్చు చేసినారని అన్వరుగారడుగగా ఆ ప్రశ్న తమకు అర్థంకాలేదని మంత్రిగారు అనిరి. ప్రయోజనకరమగు గోవులను చంపకుండా శాసనముచేయుటకు ఆలోచనలో ఉన్నదని వ్యవసాయమంత్రి ఆర్. వి. స్వామినాథన్‌గారికి సమాధానముగా తెలిపిరి. ఇది గోవుకు కసాయివానికి సంబంధించిన సమస్యగాని సభవారికెందుకుఅని అన్వరుగారనగా పసుసంపదాభివృద్ధికి ఈ సభవారు కంకణం కట్టుకొన్నారని మంత్రిగారనిరి.

అమ్మకాలపన్ను ట్రిబ్యూనల్ ఒకదానిని ప్రభుత్వంవారు ఏర్పరచ ఆలోచించుచున్నారని అది ఎప్పుడువచ్చునో చెప్పలేమనియు ఇబ్రహీంగారికి సమాధానంగా ఆర్థికమంత్రి తెలిపిరి.

# బాల్కన్ రాజ్యాలు: రష్యాకు హెచ్చరిక

(1-వ పేజి తరువాయి)

ఇలా అన్నారు:—

బాల్కన్ రాజ్యాలలో జరుగుతున్న వ్యవహారాలపట్ల బ్రిటిష్ ప్రభుత్వం తీరా సహించటం నాకుచాలా ఆందోళన జనకంగా వున్నది. మార్షల్ టిటో గనుక తొలగిపోతే, మాసిడోనియన్, స్లావ్ గెరిల్లా లంతా వచ్చిపడి తిరిగి గ్రీసులో అంతర్యుద్ధం ప్రారంభించుతారు. అంతేకాదు; రష్యా చెప్పుచేతల్లో నడుస్తున్న ఆల్బేనియా, టిటోలూ, గ్రీసుకూ, మధ్యధరా సముద్రంలోని బ్రిటిష్ నౌకాస్థావరానికీ కూడా ప్రమాదకరంగా తయారవుతున్నది.

"గ్రీసులో ఇప్పుడేమీ కల్లోలం కనుపించకపోయినా, చుట్టూ, మబ్బు మేఘములు ముసురుకుంటున్నయ్. అక్కడినుంచి బ్రిటిష్ సైన్యాలను తొలగించి వేసినందుకు చాలా విచారిస్తున్నాను. సోవియట్ రష్యా చక్రం క్రింద దేశం తరువాత దేశం ఇలా పడిపోవటాన్ని పశ్చిమ రాజ్యాలు సహించవు!"

"బ్రిటన్ ఒంటరిగా ఈ బాధ్యతలంతా నిర్వహించలేదు. బ్రిటిష్ సామ్రాజ్యం బాగా బలపడితేగాని యూరపులో శాంతి స్థిరపడదు" అన్నారు.

# పర్షియాకు అమెరికా సైనిక సహాయం

## సుల్తాన్ పర్యటన

వాషింగ్టను, నవంబరు 17: పరిషియను చక్రవర్తియగు షా ఇప్పుడు అమెరికాలో పర్యటనము చేయుచున్నాడు. వాషింగ్టను నగరములో పత్రికా ప్రతినిధులతో మాటలాడుచు షా యిట్లు చెప్పెను: రష్యావల్ల పరిషియాకు దండయాత్ర భయమున్నదని యూహించుటకు కవకాశములేదు. ఇటీవల రష్యాలో పరిషియాకు గల పరస్పర సంబంధములు కొంత చక్కబడినవి. తనయిరుసుపొరుగు రాజ్యాలతో పరిషియా రాజ్యం సఖ్యతగా ఉంటున్నది. పరస్పర గౌరవ స్వాతంత్ర్యములకు భంగములేని సఖ్యతనే పరిషియా కోరుచుండును.

పరిషియారాజ్య రక్షణ ఇతర రాజ్యాలన్నింటికిని ముఖ్యమైన విషయము పరిషియా రక్షణమీదనే మధ్యప్రాచ్య రక్షణయును దానిని బట్టియే ప్రపంచరక్షణయును ఆధారపడియున్నవి. నేను అమెరికా ప్రభుత్వ సైనికాధికారులతో నేను సమావేశమై సంభాషింపబోవుచున్న కారణమేమనగా పరిషియాకు సైనికసహాయమును చేయుటకు అమెరికా నిశ్చయించుకొన్నది. ఐక్యరాజ్యసమితి నియమావళిని అన్నిరాజ్యాలవారు గౌరవించినట్లయితే అన్నిరాజ్యాలకు మధ్య వ్యవహార సంబంధములు సామ్యంగానే వుండగలవు.

పరిషియను చక్రవర్తియగు మహమ్మదు రీజా నేడు వాషింగ్‌టన్ నగరమందు ఖండాంతరరచయితల సంఘంలో మాటలాడిన విందు సందర్భములో యుపన్యసించుచు ఇట్లు చెప్పిరి:

ఇటీవల అమెరికా ప్రెసిడెంటయిన ట్రూమను పార్లమెంటు సమావేశారంభోపన్యాసములో చెప్పిన నాలుగో అంశమును అమలుపరచుటకు పరిషియాదేశం దివ్యమైన రంగస్థలము పరిషియాకు అమెరికను శాస్త్రప్రవీణులు కావాలి. అమెరికను వస్తు సామగ్రులు కావాలి. అమెరికను పెట్టుబడుదారులు పరిషియాలో తమ వ్యాపారములను నెలకొల్పి పరిశ్రమలను నిర్వహింపవచ్చును. వారికి కావలసిన గ్యారంటీలను పరిషియా ప్రభుత్వ మీయగలదు. నేను ప్రభుత్వ నిర్వహణంలో కృషిచేసెని చక్రవర్తిని. పరిషియా రాజులగల మరకత మాణిక్యములన్నియు బ్యాంకులో నేలగదిలో భద్రం చేయబడియున్నవి. అది జాతీయ ధనకోశము. పరిషియను చక్రవర్తి నిరంకుశాధికారి కాదు. అట్టి అధికారములున్నను చక్రవర్తి వాటిని చలాయించడు.

అనంతరము ప్రెసిడెంటు ట్రూమను న్నూ పరిషియను చక్రవర్తియున్నూ కలిసి మాట్లాడుకొనిరి. పరిషియాకు అమెరికా చేయగల సహాయమునుగూర్చి మాట్లాడిరి. ఈ సమావేశము 40 నిమిషములు జరిగెను. షా చక్రవర్తికి ట్రూమను విందిచ్చినవార్తా సమయమునగాని చేసినట్లుగా షా చక్రవర్తిగాని అమెరికను ప్రభుత్వాధికారులుగాని సమావేశానంతరం చెప్పలేదు.

# రాయలసీమ పారిశ్రామిక వస్తుప్రదర్శనము

## అనంతపురంలో కలెక్టర్‌చే ప్రారంభోత్సవం

అనంతపురం, నవంబరు 18: ఆంధ్రరాష్ట్ర సహకార మహాసభతో పాటు ఏర్పరచబడిన రాయలసీమ వస్తుప్రదర్శనమునకు అనంతపురము జిల్లా కలెక్టరు సి. వివేకానందమూర్తిగారు నేటి ఉదయము ప్రారంభోత్సవం జరిపారు. ఈ సందర్భంలో వారు ప్రసంగిస్తూ మనకు లభించిన స్వాతంత్ర్యమును సురక్షితపరచి ప్రజారంజక మొనరించుటకు ఆహారవస్తూత్పత్తి అత్యవసరమనియు, అట్టి ఉత్పత్తికి ప్రజాసామాన్యమును ప్రోత్సహించు ఉద్దేశముతోను, ప్రకృతిచే నిరసింపబడియున్న రాయలసీమను ఆర్థిక వ్యావసాయక పారిశ్రామిక దృష్ట్యా పూర్వవైభవమునకు కొనిగెగ్గి రత్నాల సీమగా యొనర్చు ఉద్దేశముతోను ఈ ప్రదర్శనము ఏర్పాటు చేయబడినదనియు, ప్రజలు ధనికులు తమ వద్దనున్న మిగులుధనమును ప్రభుత్వము నప్పిదాచి ఉత్పత్తిని అధికపరచుటకు తోడ్పడుట అవసరమనియు, మన ఉపప్రధాని వాక్యములను గమనించి ప్రభుత్వముతో సహకరింప వలెననియు ఉద్బోధించారు.

వస్తు ప్రదర్శనము కలెక్టరు బంగళా వద్దనున్న మహిళా మందిర వికాలావరణములో ఏర్పాటు చేయబడినది. వ్యవసాయ పసువైద్య, మత్స్య, ఆరోగ్య, పరిశ్రమ, సహకార, మొదలగు ప్రభుత్వ శాఖలన్నియు వస్తుప్రదర్శనలు ఏర్పరచినవి. స్థానిక పరిశ్రమలను కంబళ్లు, పట్టుచీరలు నవారు, ఈతచెల్లము, మొదలగునవికూడ సహకార సంఘములు ప్రదర్శించుచున్నవి.

ప్రారంభోత్సవమునకు జిల్లా అధికారులు పురప్రముఖులు చాలనుండి వచ్చియుండిరి. మ్యూజియం కమిటీ తరఫున కమిటీ సభ్యులు పి. రామాచార్యులుగారు కలెక్టరుగారిని ప్రదర్శన ప్రారంభము గావింపగోరుచు ఇట్టి ప్రదర్శనములు ఆవాదిగా మనదేశములో కీరన్నవరాత్రులు రామనవరాత్రులు మొదలగు పండుగల ద్వారా ప్రోత్సహింపబడెననియు, బొమ్మల పూజకు ప్రాధాన్యమిచ్చి అందలి కళా కౌశలములమాట మరచుటయే అట్టి పండుగలుగూడ తగ్గిపోవుచున్నవనియు మన దేశము. స్వాతంత్ర్యము బడసినదిగనుక కనుత్పత్తి అధికముచేసి ఆ వస్తువులన్నియు శాశ్వతములుగను, ఉపయోగకరములుగను, సుందరములుగను ఉండునట్లు ప్రయత్నించవలెననియు అనిరి.

జిల్లా కలెక్టరుగారు తమ ప్రసంగమునిట్లు కొనసాగించిరి. ఇట్టి ప్రదర్శన రాయలసీమలో ఇదియే ప్రప్రథమమని తోచుచున్నది. రాయలసీమ పారిశ్రామిక కమ్యూజియంవారిచే స్వదేశీ వస్తూత్పత్తిని ప్రోత్సహించుట కిది ఏర్పాటు చేయబడినది. పూర్వము అత్యున్నత దశలో నుండిన ఈ సీమ యిపుడు వెనుకబడి నిర్భాగ్యమగుటచే దీనిని పూర్వోన్నత్యమునకు కొనివచ్చుటకు ప్రభుత్వమువారు సంకల్పించి ఇచటి వస్తువులకు ప్రోత్సాహమిచ్చుట కొరకు శాశ్వత మ్యూజియం ఈ యూర నెలకొల్పిరి. కాని అది అనుకొన్నంత ప్రయోజనకరముగా లేదు.

స్వాతంత్ర్యమువచ్చి ప్రజలకేమి మేలు గల్గెనని ప్రశ్నించుచున్నారు. అవశరము మొదలగు నిత్యావసరములకు ఇతరులపై ఆధారపడక స్వయంసంపూర్ణముగ ఉత్పత్తి చేసుకొన్నచో స్వాతంత్ర్యము సుఖవంతముగా అనుభవింపవీలగును. అందుకొరకు అందరును తమకు తోచిన కృషిచేసి ప్రభుత్వమున కూతనివ్వగోరుచున్నాను.

వస్తూత్పత్తికి ప్రభుత్వాదాయం చాలదు. ప్రభుత్వోద్యోగులు తమ జీతములలో కొంత నిలువచేసి ఇచ్చుట కంగీకరించిరి. ప్రజలుకూడ తమశక్తి వంచనలేక తమ తమ ధనములను ప్రభుత్వ బ్యాంకులలో నిల్వసేసి వస్తూత్పత్తికి దోహద మివ్వగోరుచున్నాను.

# "మానాగరికత దక్కాలంటే మేము గాంధీ ఆదర్శాలు అనుసరించాలి"

## అమెరికన్ మహిళ మిస్ రాంకిన్ అభిభాషణ

మద్రాసు, నవంబరు 19: 1917 లో అమెరికా శాసనసభకు ఎన్నికొనబడిన ప్రథమ స్త్రీ మిస్ జీనెట్ రాంకిన్ గాంధీతత్వం తెలుసుకొనడానికి ఇండియాకు వచ్చి నిన్న సాయంకాలం మద్రాసుకు వచ్చారు. ఈమె తిరిగి 1941 లో కూడా మోంటానా ప్రతినిధిగా అమెరికా శాసనసభకు ఎన్నుకోబడ్డారు.

ఈమె ప్రె. ట్ర. విలేఖరితో ఈ కింది విషయాలు చెప్పారు:

"గాంధీ తత్వం గురించీ, గాంధీనడిపిన ఉద్యమాలను గురించీ తెలుసుకొనడానికి ఇండియా వచ్చాను. అమెరికాలో మేము భద్రతా సమస్య గురించి స్పష్టమైన భావాలు లేకుండా ఉన్నాము."

తనకు యుద్ధమంటే ఇష్టంలేదనీ 1917 లోనూ 1941 లోనూ కూడా తాను శాసనసభలో ఉండి రెండు ప్రపంచ యుద్ధాలకూ వ్యతిరేకంగా వోటు చేశాననీ 1946 లో తాను ఇండియాకు వచ్చి కాంగ్రెసు మహాసభకు వెళ్లి, నెహ్రూ కృపలానీలతో ఇంటర్వ్యూ చేశాననీ, 1918 లో లాలా లజపతిరాయ్‌ను చూశాననీ, ఆనాటి నుంచీ పత్రికల ద్వారానూ అమెరికాకు వచ్చే భారతీయుల ద్వారానూ గాంధీ కార్యక్రమం గురించి తెలుసుకొంటూ వచ్చాననీ ఆమె అన్నారు.

"మహాత్మ గాంధీ ఆధ్యాత్మిక శక్తితో ఒక ఆధునిక రాజకీయ సమస్య పరిష్కరించి, అహింస ద్వారా భారత స్వాతంత్ర్యం సాధించడం ప్రపంచం గమనించ దగిన ముఖ్య విషయం. ప్రస్తుతం ప్రపంచం మారణశాస్త్రాల నిర్మాణంలో ఊదకలు తీస్తున్నది. పైకి అందరూ సామరస్యం గురించీ, సఖ్యత గురించీ మాట్లాడుతూనే అస్త్ర ప్రదర్శనాలు సాగిస్తున్నారు. మాటలకూ చేతలకూ సమన్వయం లేనిదే అభ్యుదయం చేకూరదు.

"ఆదర్శాలలో విశ్వాసం గల అమెరికనులకు గాంధీ అహింసా సిద్ధాంతం ఆమోదకరం కావచ్చు"

ఇండియా ఎంత హీనస్థితిలో ఉన్నప్పటికీ ఆదర్శాలకు ఆధారం చేసుకొని నూతన ప్రభుత్వం ఏర్పరచుకొనడానికి ప్రయత్నిస్తూ ఉండం వల్ల యూరపుకన్న ఆశాజనకంగా ఉన్నదనీ, తన ప్రజలకు అనుకూలించే నాగరికత నిర్మించుకోవడంలో ఇతర ఆసియాదేశాలకన్న ఇండియా ఎంతో ముందున్నదనీ, మీరు తొక్కే కొత్తమార్గం అందరూ సానుభూతితో గమనించాలనీ, ఈ ప్రయత్నం విఫలమైనప్పటికీ దీనినిబట్టి అభ్యుదయంగురించి తెలుసుకొనవలసినది చాలా ఉంటుందని ఆమె అన్నారు.

"అమెరికాలో కొందరు కాలచక్రాన్ని వెనకకు తిప్ప ప్రయత్నిస్తున్నారు. ఇది అసాధ్యం గమనం ఎప్పుడూ పురోగమనంగానే ఉండాలి. పురోగమించే టప్పుడు అనేక మార్గాలుంటవి. పురోగమనం గురించి సరిఅయిన ఆదర్శాలుండడం ముఖ్యం.

"క్రొత్తభావాలే నాగరికతను రక్షించగలవు. ఇండియా క్రొత్త భావాలివ్వగలిగి ఉంటే మేము సంతోషంతో వాటిని స్వీకరిస్తాం. ఇండియాలో సాగిన నవచైతన్యంలో మేముకూడా పాల్గొని బాగుపడతాము. మా నాగరికత దక్కాలంటే మేము గాంధీజీ సిద్ధాంతాలననుసరించాలి. వివాదాల పరిష్కారం విషయంలో ఇండియానుండి నేర్చుకోదగినది ఉన్నదని నా విశ్వాసం. గాంధీజీ ఆదర్శాలను గురించి సాధ్యమైనంత తెలుసుకొన్నట్లయితే గాంధీజీ ఇండియాకు ఏమి చేసిందీ అమెరికనులకు చెప్పగలుగుతాను" అని ఆమె అన్నారు. మిస్ రాంకిన్ మద్రాసులో కొన్నాళ్లుండి తరువాత వార్ధా వెళతారు.

# వరిపైరుపై కమ్యూనిస్టుల దాడి

పొన్నూరు, నవంబరు 18: జూపూడి పరిసర ప్రాంతముల కమ్యూనిస్టులు షుమారు 60 మంది, 15 వ తేదీరాత్రి కొమ్మూరగావచ్చి తన మూడు ఎకరములలో వేసిన వరిపైరును కోసి పారవేసి తనకు నష్టము కలుగజేశారని, జూపూడి వాస్తవ్యుడు మెట్ల రామస్వామి అను అసామి, పోలీసులకు ఒక ఫిర్యాదు దాఖలు చేశాడు.

పోలీసులకు కాపలా కాయుచున్న వారిని, అడ్డువస్తే చంపుతామని బెదరించి భయపెట్టి, యీ అక్రమ కార్యం చేసినారని ఫిర్యాదులో చెప్పబడినది.

సర్కిల్ యిన్‌స్పెక్టరు కె. చంద్రమౌళిగారు దర్యాప్తుజేయుచున్నారు.

నేరపు ప్రదేశంలో, నేరపుకాలంలో హాజరుగానున్న కాపలాదార్లు 22 మందిని నిర్బంధించినారట.

### కమ్యూనిస్టుల దాసోహం

పోలీసులకు కావలసియుండి, పరారీలోనున్న జూపూడి కమ్యూనిస్టులు మెట్ల శివయ్య ఉరఫ్ సీతారామయ్య, కంచేటి కోటేశ్వరరావు అనువారలు నిన్నటిదినం, తమంతటతామే పోలీసులకు వశమైనారు.

# కమ్యూనిస్టు స్థావరంపై మిలిటరీ దాడి

వరంగల్లు, నవంబరు 18: వరంగల్లు జిల్లా పోలీసు సూపరెంటు, ఖమ్మంమెట్టు డెప్యూటీ సూపరెంటుతో కలసి నిజాము సైనికదళమును, ప్రత్యేక సాయుధ పోలీసు దళమును తీసుకొని నల్గొండ, వరంగల్లు జిల్లాల కమ్యూనిస్టు ముఖ్య కార్యస్థానంపై దాడిచేసి పిసం గోపయ్య అను ప్రముఖ కమ్యూనిస్టును, మరి యిద్దరినిచంపి వేశారని తెలియవచ్చింది.

# "సమష్టిరాష్ట్రంలో ఇది ఆఖరు బడ్జెటు"

## సప్లిమెంటరీబడ్జెట్‌పై అసెంబ్లీ చర్చ

## విడిపోతున్న ఆంధ్రులకు శుభాశీస్సులు

చెన్నపట్నం, నవంబరు 19: మద్రాసు అసెంబ్లీలో నేడు సప్లిమెంటరీ బడ్జెటు చర్చలో కె. ఆర్. కరంతుగారు ఆంధ్రులు విడిపోతున్నందుకు శుభాకాంక్షను తెలుపుతూ ఇది సమష్టిరాష్ట్ర ఆఖరు బడ్జెటు కాగలదనిరి.

శ్రీమతి అమ్మన్న రాజాగారు అధ్యక్షస్థానము నలంకరించిరి. ప్రశ్నల కాలానంతరం అసెంబ్లీలో సప్లిమెంటరీ బడ్జెటుపై చర్చను ఇబ్రహీంగారు ప్రారంభించిరి. పి. నటేశన్‌గారు మద్యనిషేధము నిష్ప్రయోజనముగా వున్నదనిరి. గ్రామ విద్యుత్ ప్రణాళికలు ఆశ్చైనరకు సాగవనిరి.

కె. ఆర్. కరంత్‌గారు ఆంధ్రులను ముందు రాష్ట్రమును పొందినందుకు అభినందించుచున్నామనిరి. ఇది సమష్టిరాష్ట్ర ఆఖరు బడ్జెటు అకగలదు. ఆంధ్రులు విడిపోయి సంపత్సౌభాగ్యములతో తులతూగవలెననీ, భగవంతుడు అందులకు తోడ్పడుగాక! ఇక మీరంతా ఐకమత్యముతో ఏకోన్ముఖముగా నడవవలెను. ఈ సభలో కొంతకాలముగా మనము ఏటికొకరు, కోటికొకరు లాగుటకు అలవాటు పడినాము. అట్లుగాక దేశక్షేమమునకు అందరూ ఒక్క త్రాటిపై నడువవలెను: కోట్లకు కోట్లు సప్లిమెంటరీ బడ్జెటులలో తెచ్చి సభవారి హక్కులను లుప్తమొనర్చుట, బడ్జెటు అరిపించుకొనదు. 200 సహకార ఇనస్పెక్టర్లు, కొత్త కొత్త పోలీసు స్టేషన్లు ఈ సప్లమెంటరీ బడ్జెటులో తెచ్చుట ప్రజాస్వామ్య పద్ధతి గాదు. వందలకొలది స్కీములను సభవారి సమ్మతి లేకుండా ప్రారంభించి ఇటుల సభవారి ఎదుట తెచ్చుట న్యాయముగాదనిరి.

చినకాజీయ సాహెబ్ గారు 15 కోట్ల రూ॥ లసప్లిమెంటరీ బడ్జెటులో తెచ్చుటకు బదులుఇదిబడ్జెటు నెంబరు 2అని తెలుపుట సముచితమని యిది విచిత్రముగా ఉన్నదనిరి. బడ్జెటు మొత్తములను మంజూరు చేయుటయేగాక వినియోగ పరచునట్లు శ్రద్ధ వహించవలెను. నిరీశ్వరుడైనవాడు పలుభార్యల పెళ్లి చేసుకొనును. నిష్ప్రయోజకుడైనవాడు పదవులకై దను అనుచున్నా సామెతను చెప్పిరి. వృద్ధ వితంతువైన అనుకూల ఇంటిని చక్కగా నిర్వహించు కొనును. అటులనే ఆర్థికమంత్రి రాష్ట్రమును 'కలత జెందక దిద్దుకొనవలెననిరి.

ఎన్. ఎం. ఆర్ సుబ్బరామన్‌గారు, మధుర జిల్లాలో శాంతిభద్రతలకు రక్షణ లేకున్నదనిరి.

ఎన్. ఎం. అన్వర్‌గారు దేశమున నేడు ఆర్థికపరిస్థితి క్లిష్టముగా ఉన్నదనియు, కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వము వేరు వేరు మార్గముల పోవుచున్నవనిరి, అద్వయిజర్ల రాజ్యంలో వలె నల్గురుమంత్రులు ఉన్న చాలును.

శ్రీ గోపాలరెడ్డి: అప్పుడే శాసనసభ కూడా లేదు.

అన్వరుగారు ఇప్పుడు జమీందారీ బిల్లును అమలుచేయరాదనిరి. దొంగ సారాయి బహిరంగంగా వండబడుచున్నందున మద్యనిషేధము నిరర్థకమైనది. విద్యామంత్రి ప్రయివేటు పాఠశాలలకు ధనగ్రాంటులు ఇచ్చుట అభినందనీయమనిరి. రాజకీయ బాధితులకు భూములు ఇచ్చుట మాని ధనమివ్వవలెననిరి.

"ఆంధ్ర తమిళ రాష్ట్రములకు శుభాశీస్సులనిరి. ఆంధ్రులు మద్రాసుపై హక్కు వదలుకొనుట ఔదార్యపూరితముగా ఉన్నది."

శ్రీ తెన్నేటి విశ్వనాథం: మేము హక్కు వదలుకొనలేదు.

తమిళుల సౌహార్ద స్నేహముతో ఆంధ్రులు విడిపోవుచున్నారనిరి. ఆంధ్రరాష్ట్ర ప్రధానిగానో ఆర్థిక మంత్రిగానో గోపాలరెడ్డిగారు అపటుపూర్వము ఈ సభను ఒకసారికి తెమ్మట మంచిదనిరి.

అంతటితో సభవారు ఫలహారములకు లేచిరి.

## ప. గో. నుండి సెనేట్‌కు కాంగ్రెస్ అభ్యర్థి

విజయవాడ, నవంబరు 18: ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ కందుల ఓబులరెడ్డిగారిట్లు ప్రకటించుచున్నారు.

ప. గో. జిల్లా స్థానిక సంస్థలనుండి ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేట్ సభ్యత్వమును అభ్యర్థించు కాంగ్రెసు వాదులు, నవంబరు 22 తే అజిల్లా కలెక్టరు వద్ద నామినేషన్ దాఖలుచేసి, అదే తేదీన రు 10/- రుసుముతో రాష్ట్ర కాంగ్రెసు సంఘమునకు దరఖాస్తు పంపుకొనవలయును

# నూత్న రాజ్యాంగ ప్రాశస్త్యం

## ఉదారంగా అమలు జరపాలని అనంతశయనంగారి ఉద్బోధ

### ఓటర్లలో విద్యావ్యాప్తి: గాడ్గిల్ వివరణ

న్యూఢిల్లీ, నవంబర్ 18: నూతన రాజ్యాంగ ముసాయిదా మీద సమగ్ర చర్చను భారత రాజ్యాంగ పరిషత్తు నేడు కొనసాగించినది.

బీహార్ ప్రతినిధి రాంనారాయణ్ సింగ్ చర్చను హిందీలో ప్రారంభిస్తూ రాజ్యాంగంలో 'భారతీయ లక్షణం' ఏమీ లేదన్నాడు. ప్రభుత్వోద్యోగుల జీతాలను విమర్శిస్తూ, 100 కి 90 మంది ప్రజలకు కడుపునిండా తిండిలేనప్పుడు ఉద్యోగులు నెలకు 5 వేలు తీసుకోవటం ప్రజల్ని దోపిడీ చేయటమే నన్నాడు. రాజ్యాంగం వల్ల ఏర్పడేది ప్రజాతంత్రమే కాదనీ, కొందరు జేబులమీది ధనికులు వోట్లన్నిటినీ సంపాదించి ప్రభుత్వాన్ని కంట్రోలు చేస్తారనీ ఆయన ఆరోపించాడు.

జలంధర్ చాలివాల్ ప్రసంగిస్తూ రాజ్యాంగం అత్యద్భుతంగా ఉన్నదని ప్రశంసించాడు. రిపబ్లిక్ అధ్యక్షుడు పార్లమెంటుకు బిల్లులు తిప్పికంపే అధికారం ఉండకూడదనీ, ఆటవిక జాతుల ప్రాంతీయ కౌన్సిళ్లకు ఇవ్వబడ్డ అధికారాలు చాలా ఎక్కువనీ ఆయన విమర్శించాడు.

తిరువాన్కూర్ కొచిన్ ప్రతినిధి మిస్ అనీమాస్కరీన్ మాట్లాడుతూ నూతన రాజ్యాంగం ప్రజాస్వామ్యానికి అతిసుందరమైన బ్రహ్మాండమైన చిహ్నమని ప్రశంసించింది. అధికారం కేంద్రానికి మరీ ఎక్కువగా ఇవ్వబడ్డదన్న విమర్శలకు సమాధానమిస్తూ, ప్రస్తుత క్లిష్ట పరిస్థితుల్లో బలమైన కేంద్ర ప్రభుత్వం అవసరమని ఆమె అన్నది. యుక్తసమయంలో కేంద్రం మళ్ళీ అధికారాలను రాష్ట్రాలకు పంపవచ్చునని ఆమె అన్నది.

ప్రస్తుత పరిస్థితులలో రాజ్యాంగాన్ని నిర్మించటం ఉచితం కాదనీ, రాష్ట్రీయ భావాలలో నాజకానిని కూడా చేర్చాలనీ గోపాల్ ఖాయుధిట్ అన్నాడు.

పండిట్ లక్ష్మీకాంత మైత్రా మాట్లాడుతూ జాతిని నిర్మించిన దేశభక్తులనూ, రాజ్యాంగాన్ని సాధించిన పరిషత్తునూ ప్రశంసించాడు. 30 కోట్లపై చిల్లర సంఖ్యగల ప్రజలకు రాజ్యాంగం నిర్మించాలంటే అసంఖ్యాకంగా ఉన్న అతిక్లిష్ట సమస్యల నెదుర్కోవలసి వచ్చినదనీ, దానిని పరిషత్తు సామర్థ్యంతో నిర్వహించిందనీ అన్నాడు. నిగ్రహంలేని స్వేచ్ఛ మంచిది కాదనీ, అందువల్లనే కొన్ని నిర్బంధాలు ఏర్పరచబడ్డవని ఆయన అన్నాడు.

#### ఇతరపక్షాల విమర్శలు
#### గాడ్గిల్ వివరణ

కేంద్ర పబ్లిక్ వర్క్సుమంత్రి గాడ్గిల్ ఈ విధంగా ప్రసంగించాడు:

"నేను హిందూమహాసభ, సోషలిస్టు పార్టీలు ప్రకటించిన రాజ్యాంగ ప్రణాళికలను చూశాను. వాటికి ఈ రాజ్యాంగంలో ప్రధాన విషయాల్లో అట్టే తేడా లేదు. ఆ రెండు పార్టీలు ప్రభుత్వ విమర్శకులని అంతా గమనించాలి. కొత్తరాజ్యాంగంకింద ప్రభుత్వం ఫెడరల్ విధానాన్ని అనుసరిస్తుంది. మనకు ప్రజాస్వామ్యనిర్వహణలో అనుభవంలేదు కనక, మిగిలిన రాజ్యాంగాలలోవలె కొన్నికొన్ని విషయాలను ఆచారాన్ని బట్టి అనుసరించవలసిందని వదలటానికి వీలులేకపోయింది. ఇది శాసనానికి దారితీస్తుందనేవాళ్లు దీని అంశాలన్నిటినీ వివరంగా పరిశీలించాలని కోరుతున్నాను. మూడింట రెండువంతుల సంఖ్యాబలంతో రాజ్యాంగాన్ని సవరించటానికే కాక అసలు దానిని పూర్తిగా రద్దు చేయటానికికూడా అవకాశమున్నదని వారప్పుడు గ్రహించగలరు."

"ప్రొ॥ కె. టి. షాగారు ఈ రాజ్యాంగంలో పారిశ్రామికులను క్రమంగా రద్దుచేసే అవకాశం పార్లమెంటుకు లేదన్నాడు కానీ ఇందులో పార్లమెంటు నిర్వహణ విధానాన్ని నిర్దేశించటం తప్ప పార్లమెంటుకు గల అధికారాలేవిధంగానూ పరిమితం కాలేదు" అని గాడ్గిల్ గారు వివరించారు.

మన దేశంలో పార్లమెంటరీ ప్రభుత్వం వుండాలని సోషలిస్టులుకూడా అంగీకరిస్తున్నారు. అటువంటి పద్ధతి ఎట్లా జయప్రదం అవుతుంది అనేది అది ఎటువంటి పరిస్థితుల్లో పనిచేస్తున్నది అనే విషయాన్ని గ్రహించటంమీద ఆధారపడివుంటుంది. దేశంలో రెండేపక్షాలువుండి, వాటిద్వారా వ్యవహారాలు జరుగుతూ వుంటేనే ఈ పద్ధతికి జయం లభిస్తుంది. అంతేకాన్నా ఎక్కువ పార్టీలువుంటే, కష్టమే అవుతుంది.

ఇటువంటి సందర్భంలో సివిల్ సర్వీసు మంచి బలమైందిగా వుండాలి. మంత్రులు వస్తారు పోతారు. ప్రభుత్వాలు వస్తాయి పోతాయి. కాని ప్రభుత్వ యంత్రాంగం మాత్రం సివిల్ సర్వీసు చేతుల్లో భద్రంగా నడిచిపోతూనే వుంటుంది. అందువల్ల పార్లమెంటరీ ప్రజాస్వామ్యం విజయవంతం కావాలంటే, బలమైన, శక్తివంతమైన సివిల్ సర్వీసు వుండటం అవసరం.

కొత్త రాజ్యాంగంతోపాటు వయోజన ఓటింగు విధానంకూడా అమలులోకి వస్తుంది కాబట్టి, దాని ప్రకారం ఎన్నిక అయ్యే పార్లమెంటుకు ఇతోధిక గౌరవం, ఇతోధికమైన బాధ్యతలుకూడా వుంటాయని గాడ్గిల్ పేర్కొన్నారు. బాధ్యతలలో ముఖ్యమైంది ఓటర్లకు స్పష్టంగా విద్యాగంధం వుండేటట్లు చూడటం అని ఆయన పేర్కొన్నారు. ఓటర్లకు గనక విద్యాగంధం బాగాలేకపోతే, ఈ దేశంలో ప్రజాస్వామ్యం దెబ్బతినిపోగలదని ఆయన హెచ్చరించారు. అందువల్ల రాజ్యాంగ పరిషత్తు సభ్యులు రాజ్యాంగం అమలులోకి వచ్చేలోపల ఓటర్లకు దానికి సంబంధించిన వివిధాంశాలను తెలియజెప్ప వలసిందని ఆయన విజ్ఞప్తిచేశారు.

ఈ రాజ్యాంగం దేశంలో న్యాయశాఖకు స్వతంత్రతను చేకూర్చిందని శ్రీ గాడ్గిల్ పేర్కొన్నారు. అందులో ఇండియా ఇతరదేశాలకన్నా ముందే నడిచిందని కూడా ఆయన చెప్పారు.

తరువాత రాజ్యాంగం అంటే ఏమిటో ఆయన వివరించారు. ఒక ప్రయోజనాన్ని ఆశించి ఏ రాజ్యాంగమన్నా తయారౌతుంది. లేదా దాని బాగుఓగులు, అది ఎంతవరకు ఆ ప్రయోజనాన్ని సాధించడానికి దోహదాన్ని కల్పించింది అన్న దానిమీద ఆధారపడి వుంటాయి. ఆ ప్రయోజనాన్ని సాధించడానికి అది పనికిరాకపోయింది. దాన్ని బుట్టదాఖలు చేయటం మంచిది. దాన్ని రచించినవారు ఎవరున్నా దానితో మనకు ఎటువంటి ప్రమేయమున్నా లేదు అని ఆయన అన్నారు.

ఈ రాజ్యాంగం ఆర్థిక స్వామ్యాన్ని ప్రపంచించటంలేదని కొంతమంది అంటున్నారు. అటువంటివాళ్లను, రాజ్యాంగ భూమికలోవున్న సామాజిక, ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యాన్ని చేకూర్చాలిఅన్న మాటలను పరికించవలసిందిగా కోరుతున్నాను. అందువల్ల ఈ రాజ్యాంగంలో సామాజిక న్యాయం ప్రవర్తిల్లాలని చెబుతున్నదని, సామాజిక న్యాయం అంటే, ఉత్పత్తిసాధనాలు అన్నీ సమాజపరం కావటమనే అర్థమని ఆయన వివరించారు. కాని ఇది వెంటనే జరుగుతుందా? కొద్దికాలం తీసుకుంటుందా? అన్నది ఈ రాజ్యాంగంలో అమలులోపెట్టే ప్రభుత్వంలో పనిచేసే వ్యక్తులమీద ఆధారపడి వుంటుందని ఆయన చెప్పారు. మంచివాళ్లు అధికారంలోవుంటే రాజ్యాంగం మంచిగా పనిచేస్తుంది. ఈ పని మనం సాధించాలి. అనే కృతనిశ్చయ బుద్ధిగలవాళ్లు అధికారంలోకివస్తే, అపని అట్లాగే సాధింపబడుతుంది. సోమరిపోతులు అధికారంలోకివస్తే అంతా సోమరిపోతు తనంగానే వుంటుంది.

అంతేకాకుండా దూరదృష్టిగల అధ్యక్షుడు శక్తివంతుడైన ప్రధాని, బాధ్యత తెలిసిన శాసనసభికులు వుంటే, ఈ రాజ్యాంగంలో మనం ఎటువంటి ఆశయాలనైనా సరే సాధించవచ్చును అని శ్రీ గాడ్గిల్ తన ఉపన్యాసాన్ని ముగించారు. సభ్యులు దీర్ఘ హర్షధ్వానాలు చేసారు.

తరువాత శ్రీ అనంతశయనం అయ్యంగారు మాట్లాడుతూ ఏ ఉదారబుద్ధితో ఈ రాజ్యాంగం తయారుచేయబడిందో, అదే వినయమైన ఉదారబుద్ధితో దాన్ని అమలు జరిపితే దేశానికి శాంతి సౌభాగ్యాలు చేకూరగలవని అన్నారు. మన రాజ్యాంగం పూర్తిగా ప్రజాస్వామ్య ధర్మవిహితమైంది. అందుకు ఎన్నికలు, ముక్తాయింపులు అవసరమో అన్నీ ఇందులో వున్నాయి అని ఆయన స్పష్టం చేసారు.

ప్రస్తుతం ప్రపంచంలో చలామణీ అవుతున్న ప్రజాస్వామ్యాలను పేర్కొంటూ, అవి రెండువిధాలుగా వున్నాయని, ఒకటి పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యమని, రెండవది సామ్యవాద ప్రజాస్వామ్యమని అవి రెండూ ఇప్పుడు రెండు విరుద్ధశక్తుల్లాగా మోహరిల్లి పోరాటానికి సిద్ధంగా తలపడ్తున్నాయని అన్నారు. అందువల్ల ఇండియా ప్రస్తుతానికి ఒక మధ్యేమార్గాన్ని త్రొక్కుతూ, రాజకీయాల్లో మాత్రం ప్రజాస్వామ్యాన్ని ప్రవేశపెట్టి వెనుకదిగా సామ్యవాద ప్రజాస్వామ్యంలోనం కృషిచేయడానికి పూనుకుంటుందంటూ, ప్రస్తుత రాజ్యాంగంలో అటువంటి ఏర్పాట్లే వున్నాయని ఆయన వివరించారు.

అసలు మనం ఈ రాజ్యాంగంలో సామ్యవాద ప్రజాస్వామ్య రాజ్యం స్థాపిస్తున్నామని పేర్కొంటే చాలా బాగా వుండి వుండేదని శ్రీ అయ్యంగారు అన్నారు. కాని కొంతమందికి సామ్యవాదం అనేమాట వినడమే బాధఅని కారణంగా కొత్తమాటలు ఇందులో చేరినా, మొత్తంమీద ఈ రాజ్యాంగం పెట్టుబడి అధికారాన్ని చాలావరకు కుంచించేదిగానే తయారైందని స్పష్టం చేసారు.

శ్రీ అయ్యంగారు డా॥ అంబేద్కర్‌ను ఈ రాజ్యాంగాన్ని ఇంత సర్వజనామోదంగా సిద్ధం చేసినందుకు అభినందిస్తూ ఈ రాజ్యాంగంలో కేంద్రానికి ఇచ్చిన అధికారాలు దేశంలో ఫాసిస్టు ప్రజాస్వామ్యానికి దారి తీయకుండా అంతా చూడాలని హెచ్చరించారు.

మహాత్మాగాంధీ మనకు ఎప్పుడూ మార్గదర్శిగా వుంటూనేవున్నారు. ఇప్పుడుకూడా ఆయన్నే మనం ఆదర్శంగా పెట్టుకొని శాంతభావంతోను, సౌహార్ద శీలంతోను పనిచేస్తూ దేశంలో శాంతి సౌభాగ్యాలు వెల్లి విరిసేదాకా గట్టిగా కృషిచేయవలసివుంది.

బొంబాయిప్రధాని శ్రీ బి. జి. ఖేర్ మాట్లాడుతూ, బయటివాళ్ళ ప్రమేయం లేకుండా, ఎవరిదయనూ లేకుండా, ఈ భారత రాజ్యాంగం తయారుకావటం అతి ప్రముఖమైన విషయంగా పేర్కొన్నారు. పరిష్కార మార్గానికి పట్టుబడని బహు సమస్యలను తేలిగ్గా, సుహృద్భావంతో తేల్చి, ఇటువంటి రాజ్యాంగాన్ని తయారుచేయడానికి తోడ్పడిన సభ్యుల ఔదార్యాన్ని ఆయన హర్షించారు.

ఈ రాజ్యాంగంలో మూలసత్వాలు సరిగ్గా లేవని ప్రొఫెసర్ షా చేసిననిర్ణయం సరియైనదికాదని శ్రీ బి. జి. ఖేర్ అన్నారు. ప్రజలకు అవసరమైన సామాజిక, రాజకీయ, ఆర్థికమైన హక్కులన్నీ రాజ్యాంగంలో స్పష్ట రూపంలో వున్నాయని ఆయన అన్నారు.

న్యాయశాఖను గూర్చి మాట్లాడుతూ దేశంలో పరిపాలన అమల్లో వుండే వారంతా దుర్మార్గులని వాళ్ళనుంచి ప్రజలను రక్షించేందుకే న్యాయశాఖ వున్నదన్న భావం ఒకటి ప్రబలంగా వున్నదని, అది సరయైన భావం కాదని ఆయన అన్నారు.

శ్రీ బి. జి. ఖేర్ ప్రసంగం అనంతరం సభ సాయంత్రం 3 గంటలదాకా వాయిదా పడింది. తరువాత సభ తిరిగి 3 గంటల 10 నిమిషాలకు సమావేశమైంది.

ఈ సమావేశంలో ప్రభుదయాళ్ హిమ్మత్ సింఘా, శ్రీ హెచ్. వి. పటాస్కర్, శ్రీ కృష్ణచంద్ర శర్మ, శ్రీ ఖండూభాయ్ దేశాయ్, పండిట్ ఠాకూర్‌దాస్ భార్గవాగార్లు ప్రసంగించారు.

రాజ్యాంగం సర్వ సంపూర్ణమూ, సమగ్రము అయినదని అనడానికి వీలేక పోయినా, తృప్తికరంగా మాత్రం వున్నదని ప్రభుదయాళ్ హిమ్మత్ సింఘా అన్నారు. కాంగ్రెస్ వాదుల్లో పోరాటాలు పనికిరావని, అందువల్ల దేశం పాడై పోతుందని ఆయన హెచ్చరించారు.

ఈ రాజ్యాంగంలోకెల్లా మెచ్చుకోదగిన అంశం ఏదన్నా వుంటే, అది ఈ రాజ్యాంగాన్ని మార్చవచ్చును అని అవకాశాన్ని కల్పించే అంశమేనని శ్రీ పటాస్కర్ అన్నారు. ముందుకాలాలవారు దీన్ని బాగా ఉపయోగించుకొని, ఎప్పటి పరిస్థితులకు అనుకూలంగా వుండే విధంగా అప్పుడు ఈ రాజ్యాంగాన్ని మార్చుకుంటూ వుండగలరని ఆయన ఆశించారు.

రాజ్యాంగంలో మూల స్వత్వాలతోబాటు ప్రజల బాధ్యతలనుగూడా వివరించి వుంటే ఎంతో బాగుండేదని, శ్రీ కృష్ణచంద్రశర్మ అన్నారు.

శ్రీ ఖండూభాయ్ దేశాయ్ మాట్లాడుతూ, మన రాజ్యాంగం దేశ పరిస్థితులకు తగినట్లుగా వున్నదన్నారు. దేశంలో పెద్ద అధికారుల జీతాలవిషయంలో చేసిన నిర్ణయాలు మాత్రం తగినట్లుగా లేవన్నారు. అవి, భారతదేశం ఆర్థికస్తోమతుకు కూడా ఏమీ తగినవిగాలేక, తలకుమించిన బరువుగా తయారైనాయని, అందువల్ల ఉద్యోగులు యథార్థస్థితిని గ్రహించి నడుచుకోగలరని ఆశిస్తున్నామని ఆయన అన్నారు.

పండిట్ ఠాకూర్‌దాస్ భార్గవా పరిషత్తు అధ్యక్షుడు డా॥ రాజేంద్ర బాబును, రచనాసంఘం అధ్యక్షులు డా॥ అంబేద్కర్‌ను పొగిడారు. డా॥ అంబేద్కర్ ఇక కాంగ్రెసులో చేరి దేశ నాయకుల్లో ఒకరు కాగలరని తాను ఆశిస్తున్నట్లుగూడా ఆయన చెప్పారు. రాజ్యాంగంలో ఉన్న అన్ని అంశాలను, అరమరికలేక సరిగ్గా అమలులో పెట్టినట్లయితే గాంధీమహాత్ముడు ఆశించిన రామరాజ్యం ఏర్పడటానికి ఇక ఏ కొటు వంటి అనుమానం లేదని పండిట్ భార్గవా అన్నారు. 1950 జనవరి 26 వ తేదీ నాడు రాజ్యాంగంమీద సంతకాలు చేసేవారంతా ఆవిశంగా దేశంలో రామరాజ్య స్థాపనకు కృషి చేయవలసిందని గూడా ఆయన ఈ సందర్భంలో ఒక విజ్ఞప్తిచేశారు.

ఇంతటితో నేటి చర్చలు ముగిశాయి. పరిషత్తు తిరిగి రేపు సమావేశమౌతుంది.

నెల్లూరు జిల్లాబోర్డు ఉపాధ్యక్షుడుగా ఎన్నుకోబడిన కాంగ్రెసు అభ్యర్థి, వేమారెడ్డి శ్రీనివాసులురెడ్డి

## సహకార పరపతి అభివృద్ధి

### రిజర్వుబ్యాంకు తప్పక సహాయపడుతుంది

#### కేంద్రభూతనఖా బ్యాంకులలో సర్ రామారావుగారి హామీ

మదరాసు, నవంబరు 19: "ఇండియా వ్యవసాయ ప్రాధాన్యత గల దేశం. ఈ దేశంలో ఆర్థిక వ్యవహారములన్నింట సహకార పరపతి సంఘాలు, బ్యాంకులు ఎక్కువ తోడ్పడ గలవు. వాటికి రిజర్వు బ్యాంకు తోడ్పడక తప్పదు. వాటిని అశ్రద్ధ చేయ వీలులేదు" అని సర్ బెనెగల్ రామారావుగారు రిజర్వుబ్యాంకు గవర్నరు, నిన్న సాయంకాలం కేంద్ర భూమి తనఖాబ్యాంకు వారొసంగిన విందు సందర్భమున నుడివిరి.

బ్యాంకు అధ్యక్షులు శ్రీ భో. వెంకటరత్నంగారు స్వాగతమొసంగుచు, రిజర్వు బ్యాంకువారు తమ డిబెంచర్లలో 10% వంతుకొనుటకంగీకరించి నందుకు కృతజ్ఞత తెలిపిరి. ఆహార ధాన్యాలు ఎక్కువ పండించుట ప్రస్తుత ప్రధాన కర్తవ్యము. కావున వ్యవసాయదారులకు నూటికి 1½ న తక్కువ వడ్డీకి ఋణము లిచ్చుటకు గాను యీ బ్యాంకునకు రిజర్వుబ్యాంకు తోడ్పడవలెను. మరియు పంటలభీమా సంస్థ యొకటి స్థాపించుట మంచిది. ఇతర దేశాలలో యీ భీమానిధిల్లో పోయిన పంటల నష్టం 75% వంతు నిర్చుటకు వీలగుచున్నది. ఈ రాష్ట్రంలో యిట్టి నిధి యుండినచో రాయలసీమ కరువును, సర్కారులందు యిప్పుడు కలిగిన తుపాను నష్టములు యింత యెక్కువగా బాధించి యుండి కావు. ప్రభుత్వం ఎంత సహాయం చేసినా, భీమానిధి సహాయం చేయునట్లుగ నుండదు. అని బి. వెంకటరత్నంగారు తెలిపిరి. సభకు మంత్రి ఎ. బి. శెట్టిగారు తదితర ప్రముఖులు అనేకులు వచ్చిరి.

రామారావుగారు సమాధానమిస్తూ కృతజ్ఞత తెల్పుచు, యీ రాష్ట్రంలో సహకార సంస్థలు చేస్తున్న అమోఘమయిన సేవను కొనియాడక తప్పదనిరి. ఈ బ్యాంకునకు గల సమస్యలన్నింటి గూర్చి శ్రద్ధగ గమనించుచుంటిరి. ఇట్టి సంస్థలకు సహాయం చేయుట తమ విధియనిరి. తాను రిజర్వుబ్యాంకు గవర్నరుగ నుండు నంతకాలము సహకారోద్యమమును మరవజాలననియు, తప్పక సహాయం చేయుదునని నుడివిరి.

జి. జానకిరాం చెట్టిగారు వందన సమర్పించుటతో సభ ముగిసెను.

### వేయూరు ఎన్నిక

మదరాసు, మేయరుగా అభ్యర్థిని ఎన్నుకొనుటకు కార్పొరేషను త్రైమాసిక సభ్యుల సమావేశం 18 వ తేదీన జరిగెను. మేయరు రామస్వామి నాయుడుగారు అధ్యక్షత వహించిరి. డా॥ పి. వి. చెరియనుగారికి ప్రత్యర్థిగ డా॥ సంతోషంగారు నిలచిరి. ఉన్న పదహారు సభ్యులలో కొద్దిమంది బలపరచే వారు లేకుండిరి. చెరియనుగారు ప్రోగ్రెసివుపార్టీ సభ్యులు. డా॥ సంతోషంగారిని నేషనలు మునిసిపలు పార్టీ వారు సూచించిరి 22 వ తేదీన, కౌన్సిలరులందరి సభయందుగ రహస్యంగా జరిగినప్పుడు పేరుభేయులకు పోటీజరుగును. గెలిచినవారిని తరువాత కార్పొరేషను కౌన్సిలు సభలో ఏకగ్రీవంగా నెన్నుకొందురు.

### ఓటింగు యంత్రం

కె. రామానుజంగారు తయారుచేసిన ఓటింగుయంత్రము కౌన్సిలు అధ్యక్షులు ఆర్. బి. రామకృష్ణరాజుగారి ఆఫీసు గదిలో నిన్న ప్రముఖులకు ప్రదర్శించబడెను. ఒక పెట్టెలోనున్న కన్నముగుండు పోలింగు ఆఫీసరు సముఖమున ఇనుప ఉండను ఓటరుకొంచును. తరువాత తలుపులు వేసిన గదిలోనికిపోయి, యీ యంత్రానికి సంబంధించిన పెట్టెకుగల వేరువేరు రంగుల కాళాలలో తానుకోరు అభ్యర్థికి ఓటు వేయదలచే ఆ అభ్యర్థిరంగుగల కాళంవెంట త్రిప్పవలెను, ఆ యినుపఉండ అతనికోరే నిర్ణయింపబడిన పెట్టెలోనికి పోవును. అట్లు ప్రతిఅభ్యర్థికొచ్చిన ఓట్లు (ఇనుపఉండలు) వారి వారి పెట్టెలలో పడును. ఈయంత్రం వల్ల ఓటింగు అతిరహస్యంగా తప్పులుజరుగకుండా జరుగవచ్చునని రామానుజంగారు తెలిపిరి.

# కాంగ్రెస్‌లో సభ్యులను చేర్చడానికి గడువు

## కార్యదర్శి కళా వెంకట్రావుగారి వివరణ: ఎడ్‌హక్ కమిటీలకు హెచ్చరిక

న్యూఢిల్లీ, నవంబరు 18: కాంగ్రెసులో అర్హతగలసభ్యులను చేర్పించడానికి ఇచ్చిన గడువు నవంబరు 30 వ తేదీనుండి డిసెంబరు 15 వ తేదీకి పొడిగించడమైనదనీ, అలాగే గ్రామపంచాయతీల ఎన్నికలకు నిర్ణయించినగడువు కూడా డిసెంబరు 31 తేదీ నుండి జనవరి 31 వ తేదీకి జరుపడమైనదనీ చెబుతూ అఖిలభారత కాంగ్రెసుకమిటీ కార్యదర్శి కళా వెంకట్రావుగారు నేడొక ప్రకటన చేసిరి. కాంగ్రెసుకార్యదర్శి ప్రకటన ఇలా ఉన్నది:-

కాంగ్రెసులో ప్రాథమికసభ్యులను చేర్పించడానికై నియమించబడిన అడ్‌హాక్ కమిటీలు తమ ఇష్టానుసారంగా కొందరివద్ద సభ్యత్వపత్రాలను పుచ్చుకొని కొందరి వద్ద పుచ్చుకోవడంలేదనీ, కొన్ని రాష్ట్రకాంగ్రెసుకమిటీలుకూడా ఇలా విచక్షణ చూపుతున్నవనీ చెబుతూ అ. భా. కాం. కమిటీ కార్యాలయానికి ఫిర్యాదులు వస్తున్నవి. ఏవ్యక్తి అయినా కాంగ్రెసులో చేరదలచుకొని నిర్ణీత తేదీలోగా సభ్యత్వపత్రం సమర్పించేయెడల, ఏ కాంగ్రెసు కమిటీగాని అడ్‌హాక్ కమిటీగాని దానిని నిరాకరించడానికి వీలులేదు.

ఏకమిటీ అయినా ఈ విధంగా విచక్షణ చూపినట్లు రుజువైతే, అ. భా. కాంగ్రెసు కమిటీ దానిమీద క్రమశిక్షణ, చర్యలు తీసుకోవలసి వస్తుందని హెచ్చరించ గోరుతున్నాను. అర్హులైన సభ్యులను చేర్చుకోడానికి నవంబరు 30 వ తేదీ చివరి తేదీగా ఇదివరకు నిర్ణయించబడినది. ఇప్పుడీగడువును డిసెంబరు 15 వ తేదీవరకు పొడిగించడమైనది. గ్రామపంచాయితీ ఎన్నికలకు గడువును 1949 డిసెంబరు 31 నుండి 1950 జనవరి 31 వ తేదీకి పొడిగించడం అయినది. కొన్ని రాష్ట్రకాంగ్రెసు కమిటీలు గ్రామ పంచాయితీల ఎన్నికలకు కార్యక్రమాలను ఇంకా పంపలేదు. ఎన్నికల కార్యక్రమాలను నిబంధనలను ఏ. ఐ. సి. సి. కి త్వరలో అవిహోదాగ్గం పంపవలసిందని కోరుతున్నాను. ఎఫెక్టివ్ సభ్యులను చేర్చుకోడానికి జనవరి 15 వ తేదీ వరకు గడువు ఇవ్వబడినది. వివిధ రాష్ట్రకాంగ్రెసు కమిటీలు తాము చేర్చుకున్న ప్రాథమిక సభ్యులసంఖ్యను డిసెంబరు 10 వ తేదీలోగాను, అర్హతగల సభ్యుల సంఖ్యను డిసెంబరు 31 తేదీలోగాను ఎఫెక్టివ్ సభ్యుల సంఖ్యను 1950 జనవరి 25 వ తేదీలోగాను అ. భా. కాంగ్రెసు కమిటీ కార్యాలయానికి అందజేయవలెనని కోరుతున్నాను."

## పాటియాల సమాఖ్య మంత్రివర్గం రద్దు

### తాత్కాలిక ప్రభుత్వ నిర్మాణం

పాటియాలా, నవంబరు 18: ప్రస్తుతం అమలులో ఉన్న పాటియాలా తూర్పు పంజాబు సంయుక్త మంత్రివర్గాన్ని రేపు నవంబరు 19 వ తేదీనించి రద్దుచేస్తూ రాజప్రముఖుడొక ప్రకటనచేశారు. ఈమంత్రివర్గం అధికారంలోకి వచ్చి 10 మాసాలే అయింది.

ప్రస్తుతం మంత్రివర్గాన్ని రద్దు చెయ్యగానే ఆస్థానంలో పనిచెయ్యడానికి ఒక తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటుచేశారు. ఈ కొత్త ప్రభుత్వంలో సర్దార్ గియాన్ సింగ్, రేరివాలా, ఎమ్. ఆర్. భైడ్ గార్లు ఉన్నారు.

పూర్వం ఉన్న మంత్రివర్గం రద్దుచేస్తూ రాజప్రముఖుడు ఈ క్రింది ప్రకటనచేశారు. "ప్రస్తుతం అమలులో ఉన్న మంత్రివర్గం సర్దార్ పటేల్‌తో జరిపిన సంప్రతింపుల ఫలితంగా ఏర్పడింది. ఇందులో ఆయాముఖ్యరాజకీయ పక్షాల ప్రతినిధులు ఉన్నారు.

ఇలాగ ఉండగా మంత్రివర్గం తిరిగి నిర్మించడం జరిగితే తాము సహకరించగలమని కొన్ని రాజకీయ పక్షాలవారన్నారు. వీరందరు సర్దార్ పటేల్ తుది నిర్ణయానికి కట్టుబడి ఉండగలమనికూడా, చెప్పారు. ఆ పిమ్మట ఆయాపక్షాలవారు సర్దార్ పటేలుతో సంప్రతింపులు జరిపారు. ఆ సంప్రతింపులలో ఆయాపక్షాలవారు సర్దార్ పటేల్ తుదినిర్ణయానికి అంగీకరించగలమని అన్నారు. అయితే ఏ రాజకీయపక్షానికి ప్రజాసామాన్యంలో ఎంతెంత పలుకుబడి ఉన్నదో నిర్ణయించడం చాలా క్లిష్టసమస్య అయినది. అందుచేత ప్రస్తుత మంత్రివర్గాన్ని నేను నవంబరు 19 వ తేదీ నుంచి రద్దుచేస్తున్నాను. తాత్కాలిక ప్రభుత్వ విధులు నిర్వర్తించడానికి సర్దార్ గియాన్ సింగ్ రేరివాలా, ఎం. ఆర్. భైడ్ గార్లను నియమిస్తున్నాను. ప్రస్తుతమంత్రివర్గంలోని 8 మంది మంత్రులు తమరాజీనామాలు రాజప్రముఖునికి పంపించారు. రాజప్రముఖుడు ఈరాజీనామాలన్నీ అంగీకరించారు.

## జనపనార వస్తువుల కంట్రోలు బిల్లు

మదరాసు, నవంబర్ 18: జనపనార వస్తువుల కంట్రోలు అత్యవసర ప్రకటన శాసన సభలో ప్రవేశ పెట్టబడు బిల్లును ప్రభుత్వము అసాధారణ గెజెటులో ప్రకటించెను.

జనపనార వస్తువుల ఉత్పత్తి, సరఫరా పంపిణీలను క్రమబద్ధము చేయుట బిల్లు ఉద్దేశ్యము. ఇందుకు అవసరమగు అధికారములు జనపనార కంట్రోలరుకు ఈ బిల్లు ఇచ్చుచున్నది.

## కుడి మరమ్మతు పనుల నిర్వహణ

మదరాసు, నవంబరు 18: ఇటీవల నీటి పారుదల చిన్న చిన్న పనులు నిర్వహించక పోవుటవలన వెయ్యి ఎకరముల ఆయకట్టు గల ఒక గ్రామమునకు మించి ఉపయోగపడు చానెల్సు మరమ్మతును ప్రభుత్వమే నిర్వహించవలెనని ప్రభుత్వము ఉత్తర్వు చేసెను. ఈ కుడి మరమ్మతుల వలన లాభము పొందు ఆయకట్టు మండి రసుమువసూలు చేయు విషయం 1951/52 ఆఖరు వరకు వాయిదా వేయుటకు నిర్ణయించిరి. ఇందుకు గాను 1 లక్ష 50 వేలు ఖర్చు అంచనా వేయబడెను.

### అ. భా. సర్జనుల సమావేశము

మదరాసు, నవంబరు 18: అ. భా. సర్జనుల సంఘ సమావేశము మదరాసు మెడికల్ కాలేజీలో డిశంబరు 29, 30 31 తేదీలలో జరుగుచుండని సంఘకార్యదర్శి డాక్టర్ యం. మోహన్‌రావుగారు వ్రాయుచున్నారు.

మదరాసు గవర్నరు సమావేశమునూ ఇండియా ప్రభుత్వ ఆరోగ్యమంత్రిణి శ్రీమతి అమృతకౌర్ ప్రదర్శనమును ప్రారంభించెదరు. డాక్టర్ పి. బెనర్జీ అధ్యక్షత వహించెదరు.

## అ. భా. శస్త్రవైద్యుల మహాసభ

### మద్రాసులో సమావేశం:

మద్రాసు, నవంబరు 18: అఖిలభారత శస్త్రవైద్యుల 11 వ వార్షిక మహాసభ డిసెంబరు నెలలో 29, 30, 31 తేదీలయందు మద్రాసునందు మద్రాసు మెడికలు కాలేజి భవనములో జరుగునని ఈ సర్జనుల సంఘ కార్యదర్శి యగు డా॥ యం. మోహనరావుగారు ప్రకటించుచున్నారు. శస్త్రవైద్యమునకు సంబంధించిన ప్రదర్శనము జరుగును. ఈ ప్రదర్శనము ఇండియా ప్రభుత్వ ఆరోగ్యశాఖా మంత్రి యగు డా॥ రాజకుమారి అమృతకౌరుగారు తెరచెదరు.

సభను మద్రాసు గవర్నరు ఉపక్రమించును సభకు డా॥ పి. బెనర్జీగారు (కలకత్తా) అధ్యక్షత వహించెదరు.

ప్రదర్శనములో అనేక శస్త్రపరికరములను అమెరికను కంపెనీలు బ్రిటిషు కంపెనీలు భారతీయ వ్యాపార సంస్థలు ప్రదర్శించును.

# టిబెట్ కమ్యూనిస్టుల వశమైతే -

## "గార్డియన్" వ్యాఖ్య

మాంచెస్టర్, నవంబర్ 18:— టిబెట్ కమ్యూనిస్టులకు వశమైతే భారత దేశానికి రాగల ప్రమాదాన్ని చర్చించుచూ మాంచెస్టర్ గార్డియన్ పత్రిక యీ నెల ఒక సంపాదకీయం వ్రాసింది.

అంతర్జాతీయ రాజకీయ రంగంలో టిబెట్‌కుగల ప్రత్యేక స్థానానికి సంబంధించిన అనేక విషయాలను వివరించుచూ తమ ప్రత్యేక విలేఖరి వ్రాసిన మరొక లేఖను కూడా వారు సంపాదకీయ పుటలో ప్రకటించారు.

సంపాదకీయంలో ఇలా వ్రాసారు:—

'టిబెట్ సరిహద్దున వున్న చింగ్ హయ్ వద్ద చైనా కమ్యూనిస్టు దళాలకు శిక్షణ నిస్తున్నట్లు వార్తలు వస్తున్నవి. చైనా కమ్యూనిస్టు ప్రభుత్వం టిబెట్ స్వాతంత్ర్యాన్ని హరించటానికి ప్రయత్నించుచున్నట్లు సవ్వులూ చెప్పుకుంటున్నారు. దండయాత్ర తేదీ నిర్ణయానికికూడా ఆలోచనలు జరుగుచున్నవి. దానికింకా మూడు మాసాలకంటె వ్యవధి పట్టదు. 1950 జూలైలో ప్రారంభం కావచ్చును.

'కమ్యూనిస్టులు చైనాను ఆక్రమించుకున్న నాటినుంచీ, యెవ్వరితోనూ యేమాత్రం కలహమూ లేకుండా స్వతంత్రంగా వుంటూ వస్తున్న నేపాల్ రాజకీయాలలో జోక్యం కల్పించుకోవడానికి పూనుకోవచ్చును.

ఉత్తరం నుంచి నేపాలుమీద దండయాత్ర చేయటం దుర్ఘటమే కావచ్చు. కాని చైనీయులు నేపాలులోనే సంస్కరణోద్యమంటూ చెన్నయినా చెప్పుకొట్టవచ్చు. ముఖ్యంగా గూర్ఖాల పరిపాలన క్రింద అణచి వుంచబడిన నేవారులలో ఇలాంటిదాన్ని తేలికగా ప్రాకించటానికి సావకాశం వున్నది.

నేపాల్ భద్రత భారత దేశానికి యెంతో అవసరం. అందుచేత, నేపాలుకు యేమైన ప్రమాదం యేర్పడే శక్తులు గనుక వస్తే, ముందుగానే మేలుకొని నేపాలుకు సహాయపడవలసిన బాధ్యత భారతదేశం మీద వుంటుంది. ఈ విషయంలో తీసుకోవలసిన అవసరమైన చర్యలేమిటో ఢిల్లీ ప్రభుత్వం నిర్ణయించుకోవలసి వుంది. నేపాలుకూ, భారత దేశానికీ, ఇప్పుడు పూర్వంకంటే యెక్కువ సన్నిహిత సహకారం యేర్పడాలి. నేపాలు రక్షణకు నూతన ఆయుధ సంపత్తి అవసరమేమీ అక్కరలేదు. నేపాలుకు వచ్చే కమ్యూనిస్టు ప్రమాదం యేనాటికైనా శాంతికిపోయిన అరాజకీయ యంత్రాంగంవల్ల సంభవిస్తుందిగాని, ఆయుధలోపంవల్లగాదు. నేపాలు రాజకీయ సంస్కరణలకు గాని, ఆర్థికాభివృద్ధికి గానీ, సంబంధించి యేమాత్రం వాగ్దానం చేసినా అది సద్వార్తేనవాలి.

'కాని నేపాల్ భారతదేశాల మధ్య బ్రిటన్ యేవిధంగానూ జోక్యం కల్పించుకోనక్కరలేదు. అయితే నేపాలును బలపరచే విషయంలో భారతదేశం గనక బ్రిటన్ సహాయాన్ని గనక అభ్యర్థించినట్లయితే అట్లాంటిది లభించటానికి తప్పకుండా సావకాశంవుంది'

## మాస్కోలోని యుగోస్లావ్ రాయబారి

### రష్యా ఆరోపణ

లండన్, నవంబరు 18:— రష్యాలో వున్న యుగోస్లావ్ రాయబారి గూఢచారిగా వ్యవహరిస్తున్నాడని ఆరోపిస్తూ, రష్యా ఇవాళ యుగోస్లావియాకు ఒక ఉత్తరాన్ని అందజేసింది.

ఈ ఉత్తరాన్ని రష్యా యుగోస్లావ్ రాయబారి కార్యాలయానికి పంపిందని, అందులో చేసిన ఆరోపణకు తగిన సాక్ష్యం తనదగ్గర వున్నట్లుగూడా అందులో ఉటంకించిందని మాస్కో రేడియో నేడు వెల్లడి చేసింది.

## కలకత్తా విమాన ప్రమాదం: మరి నలుగురి మరణం

కలకత్తా, నవంబర్ 18: కలకత్తా విమాన ప్రమాదంలో దెబ్బలు తగిలినవారిలో మరి నలుగురు ఈ వేళ చనిపోయారు. వీరిలో 8 సంవత్సరాల బాలుడుకూడా ఒకడున్నాడు.

ఈ సంఘటనలో ఇప్పటికి మరణించిన వారు 15 మంది. ఇంకా మెడికల్ హాస్పిటల్లో ప్రమాదస్థితిలో వున్నారు.

కూలిపోయిన యీ విమానాల చూచుటానికి ప్రజలు, ముఖ్యంగా చిన్నపిల్లలు తండోపతండాలుగా వస్తున్నారు. ఆప్రదేశం తొలూరు యజమాని విరిగిన తుంకొక అనాథోన్మన రుసుము కూడా వసూలు చేస్తున్నట్టు తెలుస్తున్నది.

## కూర్గు భవిష్యత్

### త్వరలో కేంద్ర ప్రభుత్వ ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 17: కూర్గు భవిష్యత్ పరిపాలనా విధానము విషయమై ఇండియా ప్రభుత్వమువారు తమ నిర్ణయమును త్వరలో ప్రకటించెదరని తెలియుచున్నది. ఇప్పుడు కూర్గు కేంద్రప్రభుత్వ పరిపాలిత ప్రాంతమని పాఠకులకు తెలిసినదే యున్నది.

కూర్గు ప్రతినిధులు పం|| గోవిందం మురుగ, కూర్గు ప్ర. క. విధాన సభ, సంఘానికి ఉపాధ్యక్షుడు శ్రీ వి. పి. విరాని, హోం శాఖ కార్యదర్శి శ్రీ హెచ్. వి. ఆర్. అయ్యంగారు నేడిచ్చట సమావేశమై కూర్గు భవిష్యత్ పరిపాలనమునకు సంబంధించిన సమస్యలను విచారించిరి కూర్గు ప్రతినిధులు తమ అభిప్రాయములను వెలిబుచ్చిరి. ఈ అభిప్రాయములను ఉపప్రధాని సర్దార్ పటేలుగారికి తెలియజేసెదరు.

కూర్గు వైశాల్యము 1,593 చదరపు మైళ్లు. జనాభా 1,69,000. ఆదాయము 25 నుండి 30 లక్షల రూపాయలు. కూర్గు రసవంతమైన నారింజలకు ప్రసిద్ధిగాంచినది. భారత సర్వసేనాధిపతి జనరల్ కరియప్ప కూర్గు వాస్తవ్యుడు.

### మద్రాసు ఆసుపత్రులకు జిల్లాలనుంచి వచ్చే రోగులు

మదరాసు, నవంబరు 18:

మద్రాసు ఆసుపత్రులలో రోగుల సంఖ్య పెరగకుండా తగ్గించడానికి జిల్లాల నుంచి వచ్చే రోగులు ఆయా వైద్యులనుంచి పట్నం ఎందుకు వస్తున్నదీ, రోగ నిదానం ఏమైనదీ వివరాలన్నీ ఒక సర్టిఫికెటు తెచ్చుకొని రావలెనని ఒక నిబంధన ప్రభుత్వంవారు ప్రకటించినారనీ, ఇందువల్ల రోగులసంఖ్య తగ్గగలదని ఆశిస్తున్నామనీ, మద్రాసు ఆరోగ్యమంత్రి డా|| రాజన్ గారు నేడు కౌన్సిలులో ఒక ప్రశ్నకు సమాధానముగా చెప్పిరి.

### ఎల్. ఐ. ఎం. డాక్టర్లు సర్టిఫికేట్లు

మదరాసురాష్ట్ర ఎల్. ఐ. ఎం. సంఘ కార్యవర్గ సమావేశము మైలాపూరులో డా|| టి. ఎల్. కాంతారావుగారి అధ్యక్షతన జరిగినపుడు, రిజిస్టరయిన ఎల్. ఐ. ఎం. వైద్యులు గాయాలకు సర్టిఫికేట్లు యిచ్చే అధికారం ఉండేటట్లు ఏర్పరుచమని ప్రభుత్వాన్ని కోరుచు తీర్మానించిరి. వైద్యులుగానుండి చికిత్స చేయుటకు అర్హులుగ గుర్తింపబడినవారికి సర్టిఫికేటులు యిచ్చు అధికారం లేకుండా చేయుట సబబుకాదనిరి.

జనవరిలో జరుగు 19వ ఎల్. ఐ. ఎం. సభకు అధ్యక్షులుగ డా|| సి. సోమసుందరంగారు ఎన్నుకొనబడిరి. అపుడు దేశీయ వైద్యకళాశాల రజతోత్సవంకూడ జరుగును. డిశంబరులో ఢిల్లీలో జరుగు సేవసంఘ మీటింగుకు కౌన్సిలుసభకు అధ్యక్షులుగ డా|| వై. సూర్యనారాయణరావుగారి పేరు సూచింపబడెను.

#### ఎల్. ఐ. ఎం. సభ

జనవరిలో మదరాసులో జరుగు 19వ ఎల్. ఐ. ఎం. సభకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగ డా|| ఆ. సులాబీబాయి, కార్యదర్శులుగ డా|| ఎల్. కంఠన్ని మీనను, ఎ. ఎస్. సదాశివయ్యగార్లు ఎన్నుకొనబడిరి.

### ఐ. పి. ఎస్. ఉద్యోగులు

ఇండియా ప్రభుత్వంవారు ఎమర్జెన్సీ రిక్రూటు స్కీము ప్రకారం యీ దిగువ వారిని 1-10-49 వ తేదీనుండి ఇండియను పోలీసు సర్వీసు ఉద్యోగులుగ (ఐ.పి.ఎస్) చేర్చుకొన్నట్లు 12 తేది ఇండియా గజెటులో ప్రకటించుబడెను:—

శ్రీ బండి నిత్యకల్యాణరావు, సి. కుప్పుస్వామి, ఎ. జయరాం, ఎం. సింగారవేలు, ఎం. డి. ఎన్నెజరు, బి. ధనరాజులు నాయుడుగార్లు.

#### ఐ. ఎ. ఎస్.

ఈదిగువ ప్రొవిన్షియల్ సివిలు సర్వీసు ఆఫీసరులను ఐ. ఎ. ఎస్. ఉద్యోగులుగా [19 మంది] చేర్చుకొనిరి:—

శ్రీ హెచ్. సి. ఎం. మాకార్తీ న్ను, కె. రామకృష్ణారావు, సయ్యదు మహమ్మదు నకూబా సాహెబు, సేడు అహమ్మదు సాహెబు, వి. శివానందం, కె. గులాం మహమ్మదు, హెచ్. డి. స్టాక్సు, ఎ.ఎస్. మెస్కిన్హన్సు, ఎన్. రాజగోపాలయ్యంగారు, వి. బాలసుందరం, మహబూబు మియను, వి. రామచంద్రను, డి. ఆర్. సుందరం, ఇ. యు. దామోదరను, టి.కె. వెంకటసుబ్బయ్య పిళ్లే, టి. కె. పలనియప్పను, ఎస్. ఎం. బాలకృష్ణపిళ్లే, కె. సుబ్బయ్య నాయుడుగార్లు.

#### ఆర్యవైశ్య మహాసభ

24 వ ఆర్యవైశ్య మహాసభ డిశంబరు 15, 16, 17 తేదీలలో మేదిహాలులో మదరాసునందు వైద్య వెంకటనారాయణ ఎం. ఎ. గారి అధ్యక్షతను సమావేశమగును. జవ్వాదిపుల్లయ్య శెట్టిగారు అధ్యక్షులుగను, డా|| కె. వి. స్వామి, సి. ఆదిశేషయ్య గార్లు కార్యదర్శులుగను ఆహ్వానసంఘం చేర్చబడెను.

## మైసూరులో సహకార పద్ధతిపై సాగుబడి

### ఆహార కమిషనర్ పాటిల్ ప్రశంస

బెంగుళూరు, నవంబరు 17: భారత ప్రభుత్వ ఆహారకమిషనరు శ్రీ ఆర్. కె. పాటిల్ నేడు మైసూరు ప్రభుత్వమువారి తీవ్ర అధికాహారోత్పత్తి పథకమును కరిశీలించిరి. ఈ పథకమును గూర్చి ఆయన మైసూరు మంత్రులతో చర్చించిరి. కొన్ని గ్రామములకు గూడ ఆయన వెళ్లెను. వీనిలో ముఖ్యమైనది బెంగుళూరుకు 30 మైళ్ళ దూరమునయున్న బెలగొండ. ఇచ్చట సహకార పద్ధతులపై వ్యవసాయము జరుగుచున్నది. ఇచ్చట సమిష్టి వ్యవసాయమునకు గాను రయితులు తమ భూములను ఒక పరపతి సంఘమునకిచ్చివేసిరి. ఇట్టి కృషి శతగుణితము, సహస్రగుణితము అయిన రోజుల వ్యవసాయమునకు మేలు చేకూరునని శ్రీ పాటిల్‌గారనిరి.

మైసూరు ప్రభుత్వము బ్రహ్మాండమైన స్కీమును తలపెట్టినారనీ, ద్రవ్యాభావము వల్ల దానిని పూర్తిగా వారు కొనసాగించజాలకపోవచ్చుననీ, నేటి చర్చలను పురస్కరించుకొని దానిలో కొన్ని మార్పులు జరుగగలవని యుండునని ఆయన చెప్పెను.

దక్షిణదేశ పర్యటనమువల్ల మీకు కలిగిన భావమేమి? 1951 సం|| ము నాటికి ఆహార విషయములో దేశము స్వయం సమర్థమగు అవకాశము ఉన్నదా? అని యడుగగా అభిప్రాయము తెలుపుట కింకను సమయము రాలేదని దేశమును స్వయం సమృద్ధము చేయు కృషి యిప్పుడే ప్రారంభమైనదని పాటిల్‌గారనిరి.

రేపుఉదయము పాటిల్‌గారు హైదరాబాదుకు బయలుదేరి వెళ్ళుచున్నారు.

### ఎ. బి. షెట్టిగారు

మదరాసు, నవంబరు 18: గౌ|| ఎ. బి. షెట్టిగారు, వ్యవసాయ శాఖమంత్రి బొంబాయినుండి నిన్న వచ్చిరి. అచట ప్రత్తి పంటసభలో పాల్గొనివచ్చిరి. మదరాసునకు కావలసిన ఎరువులు ఎక్కువగ పంపుటకు ఆరోగ్యశాఖమంత్రి దౌలత్‌రాం గారు వాగ్దానం చేసిరని, వీరు తెలిపిరి.

### ఉరవకొండ విన్నపాలు

అనంతపురం జిల్లా చేనేత కాంగ్రెసు అధ్యక్షులు సంధా నారాయణప్పగారు పరిశ్రమలశాఖ మంత్రిగారి వద్దకు రాయబారంవెడలి, చేనేత పనివారికి పని కల్పించాలని, వారు నేసిన వస్త్రాలు చెల్లక నిలిచిపోతున్నవని విన్నవించిరి. తను సహాయం వెంటనే చేయకోరిరి.

శ్రీ నారాయణప్పగారు ఉరవకొండ పంచాయతీబోర్డు అధ్యక్షులు. మతిపూరికి నీటివసతి త్వరగ కల్పించమని ఆరోగ్య శాఖమంత్రిగారిని దర్శించి కోరిరి.

చన్నపురి అన్నదాన సమాజం నూతన కార్యవర్గం అధ్యక్షులుగ పి. వెంకటరమణరావు నాయుడుగారును, కార్యదర్శిగ డి. భోగనాథంగారును, నూతన కార్యవర్గమును ఎన్నుకొనబడెను.

మదరాసు గవర్నరుగారు 30 తే. మదరాసు విడచి ద. ఆర్కాడు తంజావూరు జిల్లాలు సంచారంచేసి డిశంబరు 6 వ తే. తిరిగి మదరాసు వత్తురు.

### 'మారిషస్' యుద్ధనౌక

బ్రిటిషు ఈస్టు ఇండీసు నౌకాదళాధిపతిగారి యుద్ధనౌక మారిషస్ 17 ఉదయం మదరాసు వచ్చినది. దాని కెప్టెను హిల్లైను గారు గెసిడెంటు నావలు ఆఫీసరు ఎస్. పి. నాయరుతో కలసి ప్రధానమంత్రిని మేయరుని, బ్రిటిషు డిప్టీ హైకమిషనరుని చూచిరి. ప్రధాని, మేయరు, డిప్టీ కమిషనరు స్టీమరుకుపోయి వారిని చూచిరి. 18 తే. కెప్టను హెల్కినుగారు గవర్నరుగారిని చూతురు.

విద్యార్థులకు యీ నౌకను 2-30 నుండి 4-30 గ. మధ్య చూపుదురు.

#### ధాన్య సేకరణ—సహకార సంఘాలు

విజయనగరం కోఆపరేటివ్ సెంట్రలు స్టోర్సు అధ్యక్షులు పి. మాణిక్యవర్మగారు, వి. సత్యనారాయణపట్నాయకు మున్నగు వారు ఆహారశాఖమంత్రిగారివద్దకు 16వ తేదీ రాయబారం వెడలి ఆహారధాన్యాల సేకరణ సహకారసంఘములద్వారా నేజరిపించవలెననికోరుచు విన్నపము చేసిరి.

#### ఉపాధ్యాయుల సంఘం

ద. ఇ. ఉపాధ్యాయుల యూనియన్ రక్షణనిధి తరఫున సెంటుగ్రేబియలు హైస్కూలులో (బ్రాడ్వే) విద్యాశాఖ డైరక్టరు డి. ఎస్. రెడ్డిగారు 18 తే. ఎం. సస్. సదేశనగారి చిత్రపటా విష్కరణము జరిపెను.

#### చెన్నపురి ఆంధ్ర హరిజన మహాసభ

సభ కార్యవర్గంవారు 15 తేదీ కృష్ణంపేటలో సమావేశము తుఫాను బాధితుల సహాయసంఘము నేర్పాటు చేసిరి. దానికి ఎస్. ఎన్. రాఘవులు అధ్యక్షులు, ఎస్. ఎ. రాఘవులు కార్యదర్శి, కె. రామస్వామి కోశాధికారిగ ఎన్నుకొనిరి.

## భారత శాసనసభలో అనధికారతీర్మానములు

న్యూఢిల్లీ, నవంబరు 17: బనారస్ ప్రసాద్‌గారు ఈక్రింది తీర్మానమును భారత శాసనసభలో ప్రతిపాదించుటకు నోటీసిచ్చి యున్నారు: "డాలర్ చెల్లుబడి ప్రాంతములనుండి వచ్చు దిగుమతులను, ఆహారపదార్థములలో సహా ప్రజలు వినియోగించు అన్ని వస్తువుల దిగుమతులను వెంటనే ఆపవలెను. ఈ ప్రాంతములనుండి వచ్చు తక్కిన దిగుమతులకు మారుగా మనము ఎగుమతులను హెచ్చించి మన ఎగుమతులు దిగుమతులకు సమానముగా నుండునట్లు చూడవలెను. దిగుమతులు తగ్గించుటవల్ల దేశ్యవడుకొరకను గృహపరిశ్రమలను వృద్ధిచేసి, భద్రిచేయవలెను."

రాత్రిపూట విమానములలో టపాను ప్రయాణీకులను చేరవేయుటను వెంటనే ఆపివేయవలెననని కోరు తీర్మానమును భారత శాసనసభలో ప్రతిపాదింప శ్రీ రోహిణికుమార్ ఛాదరీగారు నోటీసిచ్చి యున్నారు. ఈ తీర్మానము 30వ తేదీన సభవారు చర్చింతురు.

### శ్రీ తిరుమలరావుగారి తీర్మానము

ఈ క్రింది తీర్మానమును ప్రతిపాదింప శ్రీ తిరుమలరావుగారు నోటీసిచ్చి యున్నారు:—

"శాస్త్ర పారిశ్రామిక పరిశోధన సంఘముగాను నడుపుచున్న సంస్థలు వాని స్థాపన సమయమునుండి చేసిన పరిశోధనలు ఎంతవరకు సాగినవి? ఈ పరిశోధనలు భారత పారిశ్రామికాభివృద్ధికి యెంతవరకు తోడ్పడినవి? అను విషయమును పరిశీలించుటకు ప్రభుత్వమువారు 5 గురు సభ్యులతో కూడిన ఒక సంఘము నేర్పరుపవలెను."

కేంద్ర, రాష్ట్రీయ, సంస్థాన ప్రభుత్వములు వెనుకబడిన సంఘములవారికి ఉద్యోగములలో తగిన ప్రాతినిధ్య మిచ్చునట్లు ఇండియా ప్రభుత్వమువారు చూడవలెనను తీర్మానమును ప్రతిపాదింప డా|| దేశముఖ్‌గారు నోటీసిచ్చి యున్నారు.

కామత్‌గారు నవంబరు 30వ తేదీన పరిషత్ దైవందిన కార్యక్రమం ఉచితమైన దైవప్రార్థనతో ఒక తీర్మానానికి నోటీటు ఇచ్చారు. ఈ తీర్మానాన్ని ఇంకా చర్చకు అంగీకరించలేదు.

## బొంబాయి సంస్థానాధిపతుల వరుమానాలు

బొంబాయి, నవంబరు 18:

బొంబాయిరాష్ట్రం సంస్థానాధిపతులకు యివ్వవలసిన వరుమానాలు, మొత్తం 75 లక్షల రూపాయలవరకూ వున్నయ్. ఈ మొత్తంలో కొంతభాగాన్ని భరించటానికి కేంద్రప్రభుత్వం అంగీకరించింది.

సంస్థానాల మొత్తం ఆదాయంమీద యీ వరుమానములను నిర్ణయించివుంచటం చేతనూ, ఆ ఆదాయంలో కొంతభాగం కేంద్రానికి సంక్రమించేదిగనుకనూ సంస్థానాధిపతులకు యివ్వవలసిన మొత్తంలో కేంద్ర ప్రభుత్వం కొంత భరించాలని బొంబాయి ప్రభుత్వం కోరింది. రాష్ట్రాలు యిచ్చుకోవలసిన యీ మొత్తాలలో కేంద్రప్రభుత్వం కొంత కొంత భరించుతూ వుండాలని కృష్ణమాచారి కమిటీ వారుకూడా సిఫారసు చేశారు.

బొంబాయిరాష్ట్ర బడ్జెటులోవచ్చిన 49 కోట్ల రూపాయలకూ మించవలెనే మాత్రం తామేమీ సహాయం చేయమని కేంద్రప్రభుత్వం తెలియజేసింది. అయితే బకాయిలకు పోవటంలో కొంతమేరకు న్యాయపరమైన యీ విషయంలోమాత్రం కొంత ఆలోచించుతామన్నారు.

### ప్రత్తిపంట పెంచబడును

బొంబాయిలో జరిగిన వ్యవసాయ మంత్రులసభ ఫలితంగా చన్నరాష్ట్రమునందు ప్రత్తిపంటకై విస్తీర్ణం 1950-51లో పెంచి 95,000 బేళ్లు పండించుటకు నిశ్చయింపబడెనని, మంత్రి ఎ. బి. షెట్టిగారు తెలిపిరి. ఇండియా ప్రభుత్వంవారు ఒప్పుకుంటే బోన్సులు వేసి శనగపంట 50,000 ఎకరాలలో తగ్గించి ప్రత్తిపంట ఎక్కువ చేయబడును. అందుకు ప్రోత్సాహముండుటకు గాను వేరుశనగ ధర కంట్రోలు చేయవలెనని, వేరుశనగ ప్రత్తికి ఎక్కువ పోటీగానుండి.

గుంటూరు జిల్లాలోవలె వేరుశనగ ప్రత్తి కలిపి ఒకే పొలంలో పండించే పద్ధతి యితర రాష్ట్రాలలో అనుసరింపవలసినది అని వారు తెలిపిరి.

### పాకిస్తానుకు పరిషియా చక్రవర్తి రాక

కరాచీ, నవంబరు 18: పరిషియా చక్రవర్తి యగు షా, పాకిస్తానుకు విచ్చేయును. వచ్చే సంవత్సర రాకపై నుండు ఇరాను రిపబ్లికు ప్రభువు ఎపిగిగ అధ్యక్ష పాకిస్తానును విచ్చేయును. ఎపిగిగ అధ్యక్ష కంటె ముందుగానే పాకిస్తానుపై షా చక్రవర్తి రానున్నారు.

## కేరళలో ఉప్పు పంట

### జాతీయం చెయ్యరాదని కేంద్రం ఉత్తరువు

న్యూఢిల్లీ, నవంబరు 18: ప్రస్తుతం ఉప్పు పరిశ్రమ జాతీయం చేసే ప్రణాళిక రద్దు చెయ్యవలసిందని కేంద్ర ప్రభుత్వ పరిశ్రమల మంత్రి కేరళ యూనియను ప్రధాన మంత్రికి ఒక తంతి వార్త పంపారని తెలుస్తున్నది. కేంద్రప్రభుత్వ లవణ విధానానికి కేరళ యూనియను లవణ విధానం అడ్డు రాగలదనే అభిప్రాయంతో కేంద్ర ఈ విధంగా ఉత్తరువులు పంపినదని తెలుస్తున్నది.

జాతీయం చేసే ప్రణాళికను వివరంగా తెలిసి కొనడానికి ఒక పెద్ద ఉద్యోగిని ఎవరినైనా పంపవలసిందని కూడా కేంద్రం కేరళ యూనియనును కోరినదట.

కేంద్ర ప్రభుత్వంలో వివరాలు సంప్రదించేవరకు ఉప్పు పరిశ్రమను స్వాధీనం చేసుకోవడం ఆపివెయ్యవలసిందని కూడా కేరళ యూనియను ప్రభుత్వ కార్యదర్శికి ఒక తాఖీదు వెళ్లినదట.

భారత ప్రభుత్వ పరిశ్రమల మంత్రివర్గం కేరళ యూనియను తొందరపడి ఈ విధంగా ఉప్పు పరిశ్రమను జాతీయం చెయ్యడం మాని చాలా ఆశ్చర్య పడుచున్నదట. కొత్త రాజ్యాంగం అమలులోకి రాగానే ఉప్పు కేంద్రాధికారంలోకి రాగలదట. అందుచేతనే కేంద్ర ప్రభుత్వం కేరళ యూనియను తొందర పాటుకు ఆశ్చర్యపడినదని తెలుస్తున్నది.

## రష్యా హరించిన తూర్పు యూరప్

### మార్షల్ పరిపాలనాధికారి పాల్ హాఫ్‌మన్ ప్రసంగం

రిచ్‌మాండ్, వర్జీనియా, నవంబరు 17: 'క్రెమ్లిన్ గుప్పెటలోకి వెళ్లిన రాజ్యాలలోని అధిక సంఖ్యాకవర్గాలు, స్టాలిన్ చనిపోయినవెంటనే తిరిగి నిలవద్రొక్కుకొని స్వాతంత్ర్యాన్ని పొందగలరు' అని అమెరికా మార్షల్ సహాయ పరిపాలనాధికారి ఈ వేళ ఇక్కడజరిగినవర్జీనియా అంతర్జాతీయ వాణిజ్యమండలి సమావేశంలో ప్రసంగించారు.

అమెరికా, పశ్చిమయూరపూ బలంగా నిలబడగలిగినట్లయితే, కమ్యూనిస్టు పురోగమనం ఆగిపోవటమేగాక, అన్ని దుష్టశక్తుల మోస్తరుగానే, భస్మాసురుడులాగా దానినెత్తిన అది చెయ్యి పెట్టుకుని ఆత్మవిధ్వంసం చేసుకుంటుంది. క్రెమ్లిన్ మనుష్యుల పథకాలన్నీ భగ్నమై, రష్యా కూడా బానిసత్వం నుండి బయట బడుతుంది.

'ఇంత నమ్మకంగా, యీ మాట నేనెందుకు చెబుతున్నానంటే, పశ్చిమ యూరపును కూడా జయించితే గాని రష్యా యిప్పుడున్న భూభాగాన్ని నిలుపుకోలేదు. రష్యాకు పశ్చిమ యూరప్, సమీప ప్రాచ్యాలలోని ఉక్కు, బొగ్గూ, నూనెలూ కావలసి వుండటమే గాక పశ్చిమ యూరప్ సాంకేతిక విద్యానిపుణులు కూడా చేచిక్కితే గాని నిలదొక్కుకోలేదు' అన్నారు.

## ఇండియా-పోర్చుగల్ సంబంధాలు

### లిస్బన్‌కు భారత ప్రతినిధి ఆగమనం

లిస్బన్, నవంబరు 17: పోర్చుగల్‌లో ప్రథమ భారతీయ ప్రతినిధి పి. ఎ. మీనన్ నేడు బ్రిటన్ నుండి ఇక్కడికు వచ్చాడు. "ఇండియా, పోర్చుగల్ దేశాలమధ్య సంబంధాలు స్నేహపూర్వకంగా ఉన్నవి. అవి ఇక ముందుకూడా స్నేహపూర్వకంగానే ఉండగలవని నేను విశ్వసిస్తున్నాను." అని ఆయన చెప్పినాడు.

ఈ స్నేహపూర్వక సంబంధాలకు ఢిల్లీలో ఉన్న పోర్చుగీస్ ప్రతినిధి వాస్కోగారిన్ చాలా తోడ్పడ్డాడని ఆయన అన్నాడు.

పోర్చుగీస్, విదేశాంగ కార్యాలయ ప్రధానోద్యోగి మారినో ఒలివేరా, బ్రిటిష్ రాయబారి ప్రధాన కార్యదర్శి మాథ్యూస్, భారత ప్రతినిధి కార్యాలయ ప్రధాన కార్యదర్శి బీరేంద్ర సింగ్ ప్రభృతులు భారత ప్రతినిధికి విమానాశ్రయం దగ్గర స్వాగత మిచ్చారు. పోర్చుగల్‌లో ఉన్న భారత ప్రతినిధి కార్యాలయాన్ని లెగేషన్ అనీ, ప్రతినిధిని మినిష్టర్ అనీ అంటారు.

కరాచీలో పోర్చుగల్ ఒక లెగేషను నెలకొల్పింది.

## బ్రిటనులో ఎన్నికలు

### ఫిబ్రవరి ఆఖరున?

లండను, నవంబరు 17:—రాగల ఫిబ్రవరి ఆఖరు వారంలో గాని, మార్చి మొదటివారలలో గాని బ్రిటనులో సాధారణ ఎన్నికలు జరగవచ్చునని లేబరు ప్రభుత్వానికి సన్నిహితులు చెప్తున్నారు. ఫిబ్రవరి ఆరంభంలో లేబరు పార్టీ వారి జూబిలీ వార్షికోత్సవం జరుగుతుంది. ఎలక్షన్ ప్రచారం సాగించుకొనడానికి లేబరు పార్టీకి ఇది మంచి అవకాశం కనుక ఇది జరిగే లోపుగా ప్రభుత్వాన్ని రద్దుచేసి కొత్త ఎన్నికలు పెట్టరు.

ఆదీకాక ఫిబ్రవరి ఆఖరులోగా ద్రవ్య మారకం రేటు తగ్గింపువల్లా, నూతన ఆర్థిక విధానంవల్లా సత్ఫలితాలు కనిపించగలవని లేబరు పక్షంవారు భావిస్తున్నారు.

బ్రిటను చెల్లింపుల లోటు పరిస్థితి చాలావరకు చక్కబడినట్లు, అప్పటికి ఖజానా మంత్రి సర్ స్టాఫర్డ్ క్రిప్సు ప్రకటించగల స్థితిలో ఉంటారని వారి విశ్వాసం.

## రాత్రి విమానరవాణా విస్తరణ

### కిద్వాయ్ ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 17: రాత్రిపూట విమానములు నడుపుటవల్ల పగటిపూట నడుచు విమానములు నష్టపడునని, అవి మూతపడవలసి యుండునని వైమానిక కంపెనీలవారు, పత్రికలు వెలిబుచ్చిన సందేహములు ఒకమాసము రోజులు రాత్రిపూట విమానములను నడుపుటవల్ల పటాపంచలైనవని తపాలాతంతి శాఖమంత్రి రఫీ అహమ్మద్ కిద్వాయ్‌గారు ఒక ప్రకటనలో చెప్పుచున్నారు. రాత్రిపూట విమానములను నడుప నారంభించినది లగాయతు పగటిపూట నడుచు విమానములు ఆదివరకుకంటె యెక్కువమంది ప్రయాణీకులను, సరకులను చేరవేయుచున్నవని ఆయన చెప్పుచున్నాడు. ఒక మాసమైన తరువాత ఇతరమార్గములకు రాత్రి విమాన రవాణానువిస్తరింపజేయు విషయమైతాను ఆలోచించునని చెప్పుచున్నాడు. ఢిల్లీ-మద్రాసు, మద్రాసు నాగపూరులమధ్య విమానములనడుపు డక్కన్ ఏర్‌వేస్ తప్ప తక్కిన అన్ని విమానమార్గములలోను ప్రయాణము చేసిన జనము, రవాణాయైన సరకులు హెచ్చినవనుచున్నారు. డక్కన్ ఎయిర్‌వేసులో రవాణా కొంత తగ్గినది. ఇట్లులే రవాణాకంపెనీల దైనిక ఆదాయముగూడ పెరిగెననుచున్నారు.

## బర్మా ఆయిల్ కంపెనీలో వాటాల కొనుగోలు

### బర్మాప్రభుత్వ ప్రయత్నం

రంగూన్, నవంబరు 17: బ్రిటిష్‌వారి యాజమాన్యంక్రింద నడుస్తున్న బర్మా ఆయిల్ కంపెనీలో మూడవవంతు షేర్లు కొనేందుకు, బర్మా ప్రభుత్వం ప్రయత్నించుచున్నదనీ, సంప్రదింపులు నడుస్తున్నాయని, బర్మా ప్రధాని థాకిన్‌నూ, ఈ వేళ ప్రకటించారు.

నూనె కార్మికుల సమావేశంలో ప్రసంగించుతూ ప్రధాని ఇలా అన్నారు. 'మన విదేశాంగమంత్రి మాన్‌గారు అమెరికా నుంచి తిరిగి వచ్చేటప్పుడు లండన్‌లో దిగి కంపెనీ యజమానులతో సంప్రదించుతారు. మునుపా యిస్తున్నండా ఈనూనె గనులను స్వాధీనం చేసుకోవాలనే వాదం అర్థం లేనిపిచ్చిమాట. ఈపరిశ్రమను నిర్వహించటానికి మనకుతగిన హంగులేదు. దీనికి విదేశ సాంకేతిక నిపుణుల సహాయం వుండాలి.' అన్నారు.

## హోమియోపతీ వైద్యుల రిజిస్ట్రేషను

బొంబాయి, నవంబరు 17: నేడు న్యూఢిల్లీనుండి విమానంమీద ఇక్కడికి తిరిగివచ్చిన బొంబాయి ప్రభుత్వ ఆరోగ్య శాఖామంత్రి డా. గిల్డరు, కేంద్ర శాసన సభవారు త్వరలో హోమియోపతీ వైద్యుల రిజిస్ట్రేషనుకు సంబంధించినబిల్లు చర్చించనున్నారని తెలిపారు.

ఈ విషయమై బొంబాయిప్రభుత్వం అభిప్రాయాలు ఆదివరకే కేంద్ర ప్రభుత్వానికి నివేదించబడినవట.

జరుగబోవు అ. భా. స్వదేశీ ప్రదర్శనమునందు (కాంగ్రెసు) పాల్గొనుటకు కార్పొరేషను టవును ప్లానింగు సంఘంవారు రూ. 14,400 ఖర్చు మంజూరు చేసిరి.

## "దక్షిణ కొరియాకు విమానబలం చాలదు"

### అమెరికను సైనికాధికారి అభిప్రాయం

సియూల్ (ద. కొరియా), నవంబరు 17: దక్షిణకొరియా అధ్యక్షుడైన సింగ్మన్‌రీ ఆహ్వానంమీద మంగళవారంనాడు వచ్చిన మేజరు జనరలు రసెల్ రాండాల్ దక్షిణ కొరియాకు ఆధునిక విమానబలము ముండాలనీ, పరిశీలనకూ, రక్షణకూ అవసరమైన విమానదళా లుండాలనీ నేడు చెప్పారు.

ప్రస్తుతం ద. కొరియాదన్న విమానాలు బహుకొద్ది. 2 వేలమంది వైమానికులున్నారు. వీరిలో 100 మంది మాత్రమే విమానం నడపగలవారు. 50 మందికి మాత్రమే యుద్ధ విమానాల అనుభవం ఉన్నది.

## ఇద్దరికి కత్తిపోటు

### కలకత్తాలో కార్మికులమధ్య సంఘర్షణ

కలకత్తా, నవంబరు 17: నేడు ఎంటలీ ప్రాంతములో మృణ్మయ పాత్రల ఫాక్టరీ పనివారిలో సమ్మె చేయుచున్న వారికిని, తమపని యథాప్రకారము చేయుచున్న వారికిని జరిగిన సంఘర్షణలో యిద్దరికి కత్తిపోటుగాయములు తగిలెను. రోడ్డు ప్రక్కనున్న అనేకదుకాణములు దోచబడినవి.

ఈ దినము పనివారు ఫ్యాక్టరీకి వెళ్ళుచుండగా సమ్మెదార్లు వారిని అడ్డుపెట్టిరి. ఉభయపక్షములవారికి సంఘర్షణజరిగెను. సమ్మెదార్లు పనులలోనికి వెళ్ళుచున్న వారిలో యిద్దరిని కత్తితో పొడిచిరి గాయపడినవారు ఆసుపత్రికి చేర్చబడిరి. సాయంత్రము పనివారు ఫ్యాక్టరీనుండి తిరిగివచ్చుచుండగా మరలసమ్మెదారులతో వారికి సంఘర్షణజరిగెను. ఈ సందడిలో అచ్చట చేరియున్న జనసమూహములో కొందరు రోడ్డుప్రక్కనున్న దుకాణములనుదోచిరి. పోలీసులురాగానే దోపిడిగాండ్రు పలాయనము చిత్తగించిరి.

## గాంధీ తత్వం

### తెలిసికొనుటకు అమెరికను స్త్రీల రాక

సింగపూరు, నవంబరు 16: మిస్ ఈ సెట్టిరాంకిన్ అను అమెరికను యువతి గాంధితత్వమును బోధపరచుకొను నిమిత్తమై అమెరికానుండి భారతదేశమునకు సింగపూరుమీదు గావచ్చుచున్నది. ఆమెతోకూడా మరొకస్త్రీకూడా అమెరికానుంచి వచ్చుచున్నది. ప్రాచ్యశాస్త్రాల జ్ఞానబోధను గ్రహించుటకై యీమె వచ్చుచున్నది. మద్రాసులో ఆరుమాసములపాటు ప్రపంచమతముల అధ్యయనమునకై నడుపబడు ఈపాఠశాలలో ఆమెచేరును. ఈసెట్టిరాంకినుకన్య అమెరికా కాంగ్రెసులో (పార్లమెంటులో) సభ్యత్వము వహించిన మొట్టమొదటి స్త్రీ. ఆమె మాంటానా నియోజకవర్గం తరఫున అమెరికను పార్లమెంటుకు 1917 సం||లో ఎన్నుకోబడెను. ఈమె గాంధి నడిపించిన ఉద్యమములన్నింటిని, పరిశీలించి గాంధీతత్వసారమును బోధపరచుకొనుటకై వచ్చినది. వీరిద్దరు యీ వారం సింగపూరుమీదుగా మద్రాసుకు స్టీమరుమీద వచ్చుచున్నారు.

## కళా వెంకట్రావుగారి నిషేధాజ్ఞ

గ్వాలియరు, నవంబరు 17: మధ్య భారత సంస్థానకూటముయొక్క అసెంబ్లీ సభాధ్యక్షుడైన రామసాహాయిగారిపై విశ్వాసరాహిత్య తీర్మానమును కేంద్ర పార్లమెంటరీ బోర్డువారి అనుమతి పొందకుండా అసెంబ్లీలో చర్చించుటకు వీలు లేదని అ. భా. కాంగ్రెసు కమిటీ ప్రధాన కార్యదర్శియగు కళా వెంకట్రావుగారు మధ్యభారత ప్రభుత్వ ప్రధానియగు గోపీకృష్ణవిజయ వర్గీయగారికి తెలియజేసిరని గ్వాలియరులో అధికారికముగా వెల్లడింపబడెను.

## ఇండియా సంచార రాయబారి

వాషింగ్టను, నవంబరు 17: ఇండియా సంచారరాయబారి సర్ చింతామణి దేశ్‌ముఖ్ నేడు అమెరికా ప్రభుత్వశాఖకు సమీపప్రాచ్య, ఆఫ్రికా వ్యవహారశాఖల సహాయకార్యదర్శి అయిన జార్జి మాక్‌గీని కొద్దిసేపు సందర్శించారు. ఇది లాంఛనార్థం జరిగిందని అధికారులు చెప్పారు.

## కాశ్మీర్ స్త్రీ, శిశు కాందిశీకులు

జమ్మూ, నవంబరు 17: లాహోరు జైల్లో ఖైదు చేయబడిన కాశ్మీర్ స్త్రీ శిశు కాందిశీకులు 41 మంది యీవేళ జమ్మూకు చేరారు. వీరిని అంతర్రాష్ట్ర నిర్వేశ ఒడంబడిక ననుసరించి విడుదల చేయించి లాగడ అమృతసర్‌కు చేర్చారు. వారిని తిరిగి ఈ వేళ జమ్మూకు చేర్చినారు. వీరు తమ తమ కుటుంబాలవారికి చేర్చబడేవరకూ ప్రస్తుతం, స్త్రీ కాందిశీక రక్షణాలయములో ఆశ్రయమిచ్చారు.

## గుడ్డివారికి ప్రత్యేక షార్ట్‌హాండ్

పారిస్, నవంబరు 18: గుడ్డివారు మామూలు వాక్యంతర్వరగా ఒకరు చెప్తున్న దానిని వ్రాసుకుని టైపు చేయటానికి తోడ్పడే యంత్రాలను నిర్మించటంలో అగ్రస్థానం వహించిన ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు లూయీ జర్మేన్ లాజ్యారెన్‌ను ఫ్రెంచి ఎకాడమీ నేడు పారిస్‌లో గౌరవించింది.

## అనంతపూర్ కాలేజి విద్యార్థినీ హాస్టల్

### విద్యార్థుల అల్లరిచే వార్షికోత్సవం విరమణ

అనంతపురం, నవంబరు 15: అనంతపురం ఆర్ట్సు కాలేజి విద్యార్థినీ నివసితగృహ ప్రథమ వార్షికోత్సవము 13వ తేదీ సాయంకాలము మాజీ ప్రిన్సిపాలు శ్రీ పి. యస్. గౌడుగారి అధ్యక్షతన కళాశాలా భవనమున ప్రారంభమయ్యెను. జిల్లాకలెక్టరు మొదలగు మండలోద్యోగులును, పురప్రముఖులు పలువురును సమావేశమైరి. కార్యక్రమము ప్రారంభింపబడెను.

కాని ఈ యుత్సవమునకు కళాశాలా విద్యార్థులకు ప్రవేశమివ్వలేదు. ఇంజనీరింగు కళాశాల విద్యార్థులకు కొందరికి ప్రవేశమివ్వబడెననియు, తమకు కూడా న్యాయముగ ప్రవేశమివ్వవలెననియు లక్ష్యపెట్టకుండా విద్యార్థులు గందరగోళము జరిపి వార్షికోత్సవ కార్యక్రమము సాగనివ్వనందున, పూర్తి గాకనే నిలిపివేయబడెను.

తమను సభకు ఆహ్వానించక పోయినందుకు అసమ్మతి సూచకముగా నిన్న సాయంకాలము కొంతమంది విద్యార్థులు కళాశాలకు పాక్షిక లాంఛనపు సమ్మె చేసిరి.

## చీరాలలో కుంభవర్షం

చీరాల, నవంబరు 17: గత రాత్రినుండి యిక్కడ వర్షం జోరుగా కురియుచున్నది. గాలిలేదు. ఈ రోజు సుమారు 2 గంటలకు వర్షం నిలిచిపోయినది. కానిఆకాశము మేఘావృతమై యున్నది. తిరిగి ఆమావాస్యకు తుపాను సంభవించునా యని ప్రజలు కలవరం చెందుచున్నారు. వర్షాభావవల్ల ఈ రోజు స్థానిక హైస్కూళ్లు మూసివేసినారు.

## ఆంధ్రమహాసభ కార్యవర్గ సమావేశము

గుంటూరు, నవంబరు 15: ఆంధ్రమహాసభ కార్యవర్గ సమావేశము గుంటూరులో 23-11-49 సాయంత్రం 3 గం||లకు ఎల్. వి. ఆర్. అండ్ సన్సు క్లబ్ భవనములో సమావేశమగును. ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునుగురించి ఆంధ్ర తమిళరాష్ట్ర కాంగ్రెసు సంఘములు, మద్రాసు మంత్రివర్గము గావించిన తీర్మానానంతరము ఏర్పడిన పరిస్థితులు సింహావలోకనం చేసి భావి కార్యము నిర్ణయించుట, ఆంధ్రమహాసభ జరుపుటకు కావలసిన ఏర్పాట్లు నిర్ణయించుట కార్యక్రమములోని ప్రధాన అంశములు. రాయలసీమలోని వరదాపత్తును గురించిన్నీ, కోస్తాజిల్లాలలోని తుఫాను భీభత్సమునుగురించి, కూడా ఆలోచించబడును. అని ప్రధానకార్యదర్శి జి. వి. పున్నయ్యశాస్త్రిగారు వ్రాస్తున్నారు.

## తుపాను బాధితులకు చల్లపల్లిరాజాగారి విరాళము

బందరు, నవంబరు 17: నిన్న టిదినము స్థానిక కలక్టరు ఆఫీసులో జిల్లా తుపాను రిలీఫుకమిటీ (నాన్‌అఫిషియల్) కలక్టరు జె. పారెగారి అధ్యక్షతను సమావేశమై జిల్లా కమిటీకి క్రొత్త సభ్యులను కోఆప్టు చేసుకొని మెంబర్లు విరాళములు వసూలు చేయుటకు అధికారమిస్తూ తీర్మానించి రసీదు పుస్తకములు మెంబర్లకొసగబడెను. ఈ సభకు హాజరైన శ్రీ మంతు యార్లగడ్డ శివరామప్రసాద్, చల్లపల్లి జమీందారుగారు తుపాను బాధితుల సహాయార్థము జిల్లాకమిటీవారికి రూ 5000/-ల విరాళము నొసంగిరి.

## హైదరాబాద్ వార్తావళి

సికంద్రాబాద్, నవంబరు 17: దక్షిణ భారత సర్వసేనాని లెఫ్టినెంటు జనరల్ రాజేంద్ర సింహజీ నేటి మధ్యాహ్నం పూనా నుండి యిక్కడకు వచ్చారు.

* * *

అఖిల భారత విమాన కార్మిక ఫెడరేషన్ ఆఫ్ హోల్ కమిటీ ఆదేశాన్ననుసరించి దక్కన్ ఎయిర్‌వేస్ ఉద్యోగులు నేటి మధ్యాహ్నం అరగంట సేపు లాంఛనం సమ్మెజరిపారు. సమ్మె ప్రశాంతంగా జరిగింది.

## అ. భా. క్షయ వైద్య మహాసభ

బొంబాయి, నవంబరు 18: అఖిల భారత క్షయ వైద్యమహాసభ బొంబాయి నవంబరు 23 మొదలు 26 తేదీవరకు జరుగును. ఇండియా ప్రభుత్వ ఆరోగ్యశాఖ మంత్రి రాజకుమారి అమృతకౌరు గారు ఆ సభను ఉపక్రమించెదరు. ప్రపంచ ఆరోగ్యసంస్థయొక్క అధ్యక్షుడు కూడా యీ సభకు హాజరగును. క్షయరోగ చికిత్స విషయములో అధికార ప్రమాణములో మాట్లాడగల్గిన ప్రభుగాలు 100 మంది ప్రతినిధులు హాజరయ్యెదరు. భారతదేశంలో సాలీనా 5 లక్షలమంది క్షయ వ్యాధిచే మరణిస్తున్నారు.

# పోస్టుచెయ్యని ఉత్తరాలు

గోపీచంద్

## 6

మనం ప్రకృతీ పురుషుడూ, ప్రకృతి పరిణామం, మానవ పరిణామం, ప్రకృతి నియమం, మానవప్రయత్నం అని అనేక విషయాలు చర్చిస్తున్నాం. ఈ విధంగా చర్చించటంవల్ల వీటిని వేరు వేరుగా చూసే భ్రమ కలగటానికి అవకాశం ఏర్పడుతూవుంది.

మానవుడువేరూ, ప్రకృతి వేరూ కాదు. మానవుడు ప్రకృతి మాంటే, అనాది పదార్థంవొకటే, దాని పరిణామంనుంచే ఈ రూపాలు ఉద్భవిస్తూ వున్నవి. నీవు 'పదార్థం', 'మానవుడు' మానవుడు బయటి పదార్థంమీద పనిచెయ్యటం', 'బయటి పదార్థంమానవునిమీద తనప్రభావం చూపటం' అని వ్రాసినప్పుడు, నీకీవిషయం తెలిసిందేఅయినా, మరచిపోయినట్టువున్నావు. అందుకనే, మానవునికి బయటవున్న దాన్ని పదార్థమనీ, మానవుణ్ణి దానికి సంబంధం లేనిమరోకవస్తువుగా తీసుకొనినీవుమాట్లాడ గలుగుతున్నావు.

నేను నీ ఈ ఉద్దేశంతో ఏకీభవించలేక పోతున్నందుకు చాలా విచారిస్తున్నాను. ప్రకృతి పరిణామంలో ఒకదశ మానవుడు. అంటే ప్రకృతే మానవుడు. ప్రకృతికి వర్తించే సూత్రాలన్నీ మానవునికీ వర్తిస్తాయి. మానవుడు నియమబద్ధంగా వుంటానికీ, నీతిప్రదంగా బ్రతకాలని ప్రయత్నించటానికీ ఇదే కారణం. అయితే ప్రకృతి పరిణామంలోని మిగిలిన దశలకూ మానవునికీ ఒక తేడావుంది. అది మానసికశక్తి. ఈ మానసిక శక్తివల్ల మానవుడు తన్ను తాను విడిగా చూసుకోగలుగుతున్నాడు. మిగిలిన ప్రకృతిని తనకు విడిగా చూడ గలుగుతున్నాడు. దీనివల్ల 'కర్త', 'కర్మ' అనే విభజన ఏర్పడింది. కాని నిజంలో చిక్తే రెండూ ఒకటే. నేను నాకుకర్తని. నీకు కర్మని. నాకు నీవు కర్మవి, నీకు నీవు కర్తవి. Feuerbach ఈమాటే చెప్పాడు. హైకనాప్ అతని ఉద్దేశాన్ని సమర్థించి విపులపరిచాడు—"కర్మకు వ్యతిరేకంగా వున్న కర్తగా నేను ఆలోచించను. కర్తా కర్మా నేనుగానే నేను ఆలోచిస్తాను. నేను నాకళ్ళకు కనపడే వస్తువునే కాక, నా చూపుకి అధారంగా వున్న దాన్ని కూడా 'కర్మ' గానే పరిగణిస్తాను. బయటిప్రపంచం, నాకు బయటగా కాక, నాకు లోపలగా కూడా వుంది. మానవుడు ప్రకృతిలో భాగం మాత్రమే!" డరింగ్ మీద వ్రాసిన విమర్శలో ఎంగెల్సుకూడా ఈభావాన్నే సమర్థించాడు.

ఆధ్యాత్మికవాదులు చెప్పినట్లు, భావం పదార్థం వేరుకాదనీ, పదార్థంలోనుంచే భావం పుడుతుందనీ చెప్పటానికి ప్రకృతీ పురుషుడూ రెండూ మానవుడేనని పై విధంగా చెప్పారు. కాని ఈ సత్యాన్ని, మరోకవిషయం అర్థంచేసుకోటానికికూడా ఉపయోగించుకోవచ్చు.

మానవుడు ప్రకృతిలోభాగమే, కాబట్టి ప్రకృతి నియమాలన్నీ మానవునికే వర్తిస్తాయి. మానవుడు ప్రకృతిని అర్థంచేసుకోవాలంటే తన్ను తాను తెలుసుకుంటే చాలు. యోగసాధనతో తన్ను తాను తెలుసుకోటానికి ప్రయత్నించే మానవునితో మనకు అభ్యంతరం వుండవలసిన అవసరంలేదు అనుకుంటాను. అయితే నీవు అన్నట్లు, ప్రపంచ పరిస్థితులకూ, మానవసంఘానికీ దూరం అవటంవల్ల, మరోకరకం జీవితం జీవించటంవల్ల, వారి బుద్ధి పెడదారులు తొక్కటానికి వీలు లేదా అనే ప్రశ్న వస్తుంది. నేనీ ప్రశ్నకు జవాబు చెప్పలేనని వొప్పుకుంటాను. కాని వారి పరిస్థితులు సత్యాన్వేషణకు అనుకూలంగా వుంచుకొని, ప్రపంచంలో జరిగే విషయాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ వుంటే నీవు ఊహించే ఘోర పరిస్థితిరాదు అనుకుంటాను. వీళ్లనా లోపలకు చూడటం మానుకొని దృష్టినీ ప్రయత్నాన్నీ బయటకు పంపటమే పనిగా పెట్టుకున్న దానికంటే ఇది ఎక్కువ ప్రమాదంకాదు అని మాత్రం చెప్పగలను.

ఏకాంత వాసాన్ని, అభిలషించటానికి ఆధ్యాత్మిక వాదులు మరొక కారణం చెపుతారు. మనం వొక నాగరికతలోకి, వొక సాంఘిక నిర్మాణంలోకి పుడుతున్నాం. పుట్టి పుట్టినప్పటినుంచి, పరిస్థితులు మనకొక దృష్టిని కలిగిస్తున్నాయి. క్రమ క్రమేణా మనం మనం పరిస్థితుల చేతుల్లోని కీలుబొమ్మలం అవుతున్నాం. మనకు స్వతంత్ర్యం వుండదు. ఒక ఏది సత్యమో తెలుసుకొని, దాని ప్రకారం ప్రవర్తించే అవకాశం మానవునికి ఎలా లభిస్తుంది? ఈ జంఝాటంలో వున్నంతకాలం, ఈజంఝాటానికి [illegible] హద్దోనటంకంటే మనకు [illegible] వుండదు. కాబట్టి ముందు ఈ జంఝాటం నుంచి తప్పుకో. నిశ్చల ప్రదేశంలో ఏకాగ్రచిత్తంతో చూస్తేనే, అసలు 'సత్యం' ఏదో తెలుసుకో. ఆది తెలుసుకున్న తర్వాత నీయిష్టం వచ్చినట్టు ఆచరించు [illegible] ప్రపంచంలో అడుగుపెట్టి ప్రజల జీవితాలను నీవు కనిపెట్టటానికి అనుకూలంగా మనకు [illegible] సత్యాన్వేషణకు ప్రకాశాలు: వారిని సక్రమమార్గంలో నడుపు. ఆధ్యాత్మిక వాదులు ఈ విధంగా ఆలోచిస్తున్నట్లు కనుపిస్తుంది.

బుద్ధుడు ఈ విధంగానే వేదాంతి సంగతి నీకు తెలుసు. మనస్సుని ఆందోళన పరిచే విషయాలుచూచి, ఈ ప్రపంచ స్వభావాన్ని తెలుసుకోవాలని రాజ్యాన్ని త్యజించి, సత్యాన్వేషణకు పూనుకున్నాడు. జ్ఞానోదయం కలిగినతర్వాత తిరిగి ప్రజల్లోకి వొచ్చి, వారి శ్రేయస్సుకై పాటుపడ్డాడు. తాను ఉపదేశించటమే కాక వుపదేశించినట్లు జీవించాడు.

మానవుడు ఆవేశాలకు లోనౌతున్నంత కాలం సత్యానికి దూరంగానే వుంటాడనీ సత్యాన్వేషణకి నిశ్చలత్వం అవసరమనీ ఆధ్యాత్మిక వాదుల నమ్మకం, అందుకు రామణీయకమైన ప్రకృతీ, శాంతియుతమైన పరిసరాలూ సహాయ పడతవని వారు అనుభవంలో చెపుతారు.

ఈ విషయం నేను ఇంత విపులంగా ఎందుకు వ్రాస్తున్నానో, ఈపాటికి నీవు గ్రహించే వుంటావు. మామూలు జీవితాన్నుంచి తప్పుకొని, 'సత్య' పరిశీలనలో నిమగ్నులైన వారిపట్ల మనకొక దురభిప్రాయంవుంది. అవని మనం అనుకున్నంత తప్పుపనిగా నాకు కనపట్టంలేదు, ఆధ్యాత్మిక వాదులు ముక్తికి ఇది వొక్కటే మార్గం అని చెప్పరు. వారిలో లౌకిక వ్యవహారాలను సక్రమంగా నిర్వహిస్తూ ముక్తిని పొందిన జనకమహార్షి వున్నాడు. తాము సిద్ధినిపొంది, సంఘసేవకు తమ జీవితాలను అంకితం చేసినవారున్నారు, తమముక్తితో తృప్తిపడిన వారున్నారు...

నేను నీకు చెప్పదలచినదల్లా, వీరిని గురించి ముందే ప్రిజుడిస్ కావద్దని, వారు చెప్పే విషయాలలో మనం నేర్చుకోదగ్గది ఏమీలేదని ముందే నిర్ధారణ చేసుకోవద్దనీ మాత్రమే! మనం బయట ప్రకృతికి ప్రాధాన్యత ఇస్తే వారులోపల ప్రకృతికి ప్రాధాన్యత ఇచ్చారు. మనం పనికి ప్రాధాన్యత ఇస్తే వారు ఆలోచనకు ప్రాధాన్యత ఇచ్చారు. ఈ రెండూ అవసరమేననీ, ఒకదానిమీద ఒకటి ఆధారపడి వుంటవనీ మనకు తెలుసు. వారేదన్నా తప్పుచేస్తుంటే, మనం చేస్తున్న తప్పే, మరొక రకంగా చేస్తున్నారని మాత్రమే అనగలం. జీవితానికి ఆలోచనా పనీ రెండూ అవసరమే. ఆనాలోచితమైన పనీ, ఆచరణకు రాని ఆలోచనా, రెండూ ప్రమాదమే!

కేనీమున్ఫ్ ఎలెక్సీ కారెల్ పుస్తకం చదివాను. ఆ పుస్తకం చదువుతుంటే నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. మానవుని వ్యక్తిత్వాన్ని చంపి, మానవుని సహజ స్వభావానికి విరుద్ధంగా పెరిగిన ప్రపంచం ఎంత ఘోరంకదిగా తయారైందో వర్ణిస్తూ, నివారణోపాయం అతీవిధంగా సూచించాడు— "ప్రస్తుత పరిస్థితులవల్ల కలిగిన మానసిక, నైతిక [illegible] పతనాన్నుంచి మానవుణ్ణి వెలికి తియ్యాలి. అతనిలో అంతర్గతంగా వున్న శక్తుల వృద్ధి చెందేటట్టు చూడాలి. అతని శక్తులను పునస్సమకూర్చాలి. అతని టిష్యూల లోనూ, చైతన్యంలోనూ వున్న [illegible] సుఖాలను పూర్తిగా వాడుకోటానికి వొప్పేటట్టు చెయ్యాలి. ఈనాటి చదువూ, నాగరికతా అతనిచుట్టూ కట్టినగోడలను బ్రద్దలుకొట్టాలి. కరడు కట్టిన సిద్ధాంతాలతో సంబంధంలేకుండా చెయ్యాలి. మానవునికి సంపూర్ణ స్వాతంత్ర్యం లేకపోవటం, నాగరికతతో కట్టుబడివుండటం మనం కాదనలేము. కాబట్టి అతన్ని మార్చాలంటే ముందు ప్రపంచాన్ని మార్చాలి. మానవుని [illegible] మానసిక శక్తికి పునాదిగావున్న సాంఘిక చట్రాన్ని కొత్తగా నిర్మించాలి. కాని సంఘం ఎంతపనిచేసే అటు మార్చటానికి సిద్ధంగా లేదు. దాని ఆకారాన్ని వెంటనే మార్చలేము: అయినప్పటికీ ఈ ప్రయత్నం వెంటనే మొదలవ్వాలి. ప్రతివ్యక్తికీ తన జీవితాన్ని తన పరిసరాల్ని మార్చే శక్తి వుంది. ఆలోచన లేనివాడికి [illegible] కావలసిన పరిస్థితులను సృష్టించుకునే శక్తి అతనికివుంది. కొంత వరకు తన్ను [illegible] విశేషమకొని, [illegible] కొన్ని నియమాలు పాటించి, కొన్ని అలవాట్లను సృష్టించుకొని, మనస్సునీ [illegible] [illegible] అధికారాన్ని సంపాదించు కోగలడు. కాని [illegible] పిక, [illegible], ఆస్తిక వాతావరణాన్ని ఏర్పరుచుకోలేడు. దీని విజయంతంగా ఎదుర్కోటానికి తనలాగే ఆలోచించే వారిని కూడగట్టుకోవాలి............

ప్రస్తుతం ఆచరణలోవున్న నమ్మకాలేవీ ప్రశ్నించటానికి వీలులేనివి కావు. ఆకాశాన్నంటే ఫ్యాక్టరీలూ, ఆఫీసు కట్టడాలూ, మానవులు వుంటానికి వీల్లేని నగరాలూ పారిశ్రామిక సంస్కారం, Mass Production లో గుడ్డినమ్మకం, ఇవన్నీ నాగరికతకు తప్పక వుండవలసిన లక్షణాలు కావు. మరొక రకంగా ఆలోచించటానికీ, బ్రతకటానికీ వీలువుంది. విషయవాంఛలకు ఆశ్రయం ఇవ్వని సంస్కారం, అందం, మానవుల్ని బానిసలు చేసే యంత్రాగారాలతో సంబంధంలేని యంత్రాలూ, పదార్థాన్ని దేవుని స్థానంలో పెట్టి పూజించని సైన్సూ—ఇవీ ప్రస్తుతం అవసరం. ఇవి మానవుని తెలివి తేటలనూ, శక్తినీ, నైతిక దృష్టినీ వృద్ధి చేసి, మానవపురోభివృద్ధికి సహాయం చేస్తవి."

ఈవిధంగా వ్రాశాడు. ఈ గ్రంథకర్త మానవుల శక్తిలో వున్న తేడాలు అంగీకరించక తప్పేదేమీలేదు అంటాడు. ఈ భేదాలు పుట్టుకవల్లా, శారీరక స్థితివల్లా ఇంకా అనేక కారణాలవల్లా ఏర్పడతవి. కొందరికి అతి సునిశితమైన మానసిక శక్తి వుంటుంది. వారిని ఆలోచించనివ్వు. కొందరికి ఈ శక్తి తక్కువగా వుంటుంది వారికి కాయకష్టం తప్పదు. పనిచెయ్యటం ముఖ్యం అనుకొని, పని అంటే కాయకష్టమే పని అనుకొని, ఆలోచనాపరులతో కాయకష్టం చేయించీ, ఆలోచన ముఖ్యం అనుకొని, కాయకష్టం చేసేవారికి ఆలోచించే పని అప్పజెపితే లోకం ఏమౌతుందో నీవు ఊహించుకోవొచ్చు. ఈ విషయం తర్కిస్తూవుంటే నాకు ఇంకొకవిషయం తడుతూవుంది. మనం, మనచిన్నతనంలో కొంతమందిని, పనికిరాని రాజకీయ వాదులు, అని హేళన చేస్తూవుండేవాళ్ళం. నీకు జ్ఞాపకం వుండవచ్చుననుకుంటాను. మనఉద్దేశం, వారు మార్పుని ఉద్దేశాలు వెలిబుచ్చుతూ వుంటారనీ, ప్రజల్లోపడి పని చెయ్యరనీ! ఇది మంచిపనికానిమాట నిజమే! కాని వారు వెలిబుచ్చే భావాలు అభ్యుదయకరమైనవో, కావో నిర్ణయించటానికి మనం ఉపయోగించిన కొలబద్ద తప్పని ఈ నాడు నాకు అనిపిస్తూవుంది. వారి భావాలను తర్కించి మంచి చెడులను నిర్ణయించటం న్యాయం. ఒకవేళ ఆయన భావాలు మంచివైనా, ఆయన ప్రచారానికి పూనుకోకపోతే, మనం అవనికి పూనుకోవచ్చు గదా! 'పనిచెయ్యటం' అనేదానికి మనం చాలా సంకుచితమైన అర్థం అంటకట్టామేమో అని నా అనుమానం. దీనివల్ల ఆధ్యాత్మిక వాదులు చేసిన ప్రతిదీనీ మనకు వికటంగానే కనపట్టం మొదలు పెట్టింది. భౌతిక వాదులు బాహ్య ప్రపంచాన్ని గురించి తెలుసుకోటానికి ప్రయత్నిస్తే ఆధ్యాత్మిక వాదులు మానవుణ్ణి గురించి తెలుసుకోటానికి ప్రయత్నించారు.

మానవుణ్ణి గురించి తెలుసుకోవలసిన అవసరం ఈనాడు మరీ ఎక్కువైంది. ఎందుకంటే మానవుడు ఇష్టపడుతున్న నాగరికత సుఖదాయకంగాలేదు. ఈనాగరికతవల్ల మానవుడు ఉక్కిరిబిక్కిరై పతనం అవుతున్నాడు: అధోగతికి పోతున్నాడు. ప్రాణంలేని పదార్థాలను గురించి ఆలోచిస్తూ తన్మయత్వం పొంది తనసంగతి తాను మరచిపోయాడు. బయట ప్రపంచానికే వుష్లేనే, తన శరీరం తనచైతన్యం కొన్ని నిబంధనలమీద ఆధారపడి వృద్ధిచెందుతుందని మరచిపోయి వాటికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తూ, వాటికివిరుద్ధంగా వుండే నాగరికతను సృష్టించుకొని భిన్నడై కూర్చున్నాడు. ఈ పరిస్థితిమారి, మానవుడు లేచేందుకు కావాలంటే, ప్రపంచానికీ, మనుష్యులకూ, వారి స్నాయువులకూ, మనస్సుకూవున్న సంబంధాలను క్షుణ్ణంగా, సమగ్రంగా తెలుసుకోవాలి. మానవుడు వీటి నన్నిటికంటే ముఖ్యుడు. అతడు పతనమైతే ప్రపంచమే కూలిపోతుంది.

మనిషినిగురించి తెలుసుకోవటం కూడా బాహ్యప్రపంచాన్నిగురించి తెలుసుకోటానికి మనం ప్రయత్నించటానికి, అనేక కారణాలున్నాయి. మనిషికి బ్రతకటం ముఖ్యం. అందుకుగాను బయటి ప్రపంచాన్నిగురించి తెలుసుకోవలసిన అవసరం, దాన్ని లోబరచుకోవలసిన అవసరం మనిషికి కలిగింది. ఇతర మానవులనుంచీ, క్రూర మృగాలనుంచీ తన్ను తాను రక్షించుకోవలసిన అవసరం మానవునికి మొదటినుంచీ వుంది. తను ప్రాణాలను నిలబెట్టుకోటానికి ఆహారం సేకరించాలి. ఈ అవసరాల మధ్య పడినమానవునికి తన్నుగురించి ఆలోచించుకోటానికి తగిన తీరిక దొరకలేదు అంటేనూ, ఆబుద్ధి పుట్టలేదు అంటేనూ, నీవు ఆశ్చర్యపడవు అనుకుంటాను. మానవుడు తన తెలివితేటలను, తనకు ముఖ్యమైన ఆయుధాలనూ, కొరముట్లనూ, తయారు చేసుకోవటంమీద కేంద్రీకరించాడు. తన్ను గురించితాను ఆలోచించకముందే, సూర్యునిగురించీ, చంద్రునిగురించీ, నక్షత్రాలను గురించీ, ఋతువులనుగురించీ ఆలోచించటం ప్రారంభించాడు. శారీరక శాస్త్రం ఊహించకముందే, జ్యోతిష్య శాస్త్రం వృద్ధిచెందింది. మనస్సు, కార్టెక్సు, Thyroid Gland, —వీటి స్వభావాన్ని గానీ, నిర్మాణాన్ని గానీ తెలుసుకోకముందే గెలిలియో భూగోళాన్ని, ప్రముఖ స్థానాన్నుంచి తొలగించి సూర్యుని ఉపగ్రహంగా నిర్ణయించగలిగాడు. బెర్గ్‌సన్ అరవిందులు మొదలైనవారు మనిషిగురించి మనం ఎక్కువగా తెలుసుకోలేక పోవటానికి మనస్సుయొక్క సంకుచితశక్తి కారణం అంటారు. మనస్సుకి చిన్న చిన్న విషయాలు గ్రహించే శక్తి గాని, చిక్కు విషయాలను గ్రహించేశక్తి లేదనీ, అందువల్ల మనిషిని గురించి ఎక్కువ తెలుసుకోలేక పోతూ వుందనీ చెపుతారు. కారణం ఏదైనా, మనిషిని గురించి ఈనాడు మనకు తక్కువ తెలుసనీ, తెలుసుకోవలసిన విషయాలు చాలా ఉన్నాయనీ, అలా తెలుసుకోవలసిన అవసరం ఈనాడు చాలా ఎక్కువైందనీ మనం వొప్పుకోక తప్పదు. తెలిసో తెలియకో మనస్వభావానికి అనుకూలంగా ప్రవర్తిస్తున్నంత కాలం బాగానే వుంది. కాని ఇప్పుడు ఫలితాలను బట్టి చూస్తే మనం అలా ప్రవర్తిస్తున్నట్టు కనపట్టంలేదు అందువల్ల మన సంగతి మనం తేల్చుకోవలసిన సమయం దగ్గరకు వొచ్చింది.

మానవుడు భౌతిక ప్రపంచంమీద తన శక్తినంతా కేంద్రీకరించటంవల్ల, జీవితంలో ఆధ్యాత్మిక విలువలకు చోటు లేకుండా పోయింది. మన పరిస్థితులను గురించి మనం తెలుసుకోవటం అవసరమే, కాని మనల్ని గురించి మనం తెలుసుకోవటం ముఖ్యం. రోగాలూ, బాధలూ, మరణాలూ మానవుని దృష్టిని కొంతవరకు లోపలకు త్రిప్పినమాట నిజమే. ఈనాటి మన జ్ఞానానికిఅందనిఊహాలూ, కోర్కెలూ కొంతమందిని మానవుని సంగతి తెలుసుకోటానికి ఉత్సాహపరచినవి. మన పూర్వులు మానవుని ఉనికిని గురించీ, మానసిక సంక్షోభాన్ని గురించీ, తెలియని దాని కోసం ఆరాటపడే స్వభావాన్ని గురించీ, పరిశోధనలు చేశారు. కాని ఈ ప్రయత్నం మానవునికి తీరిక దొరికినప్పుడూ, తన దృష్టిని బయటి ప్రపంచాన్నుంచి త్రిప్పే అవకాశం దొరికినప్పుడూ మాత్రమే జరిగింది," అంటున్నాడు కారెల్.

మనిషిని ముక్కలు ముక్కలక్రింద విభజించిమాస్తే, అతని స్వభావం మనకు బోధపడదు మనిషిని సంపూర్ణంగా చూసే గలిగిన శక్తి మనకు కావాలి. అలా చూసే గలిగిన శక్తిగానీ చూపగలిగిన సాధనం గాని మనకులేదు. అందువల్ల విభజించి చూడటం మనకు తప్పటంలేదు. అందుకని రకరకాల శాస్త్రాలమీద ఆధారపడుతున్నాం. ఈ శాస్త్రాలు తాము పట్టుకున్న ముక్కనిబట్టి మనిషితత్వాన్ని నిర్ణయిస్తున్నయి. కాబట్టి మానవుని తత్వం జవాబు చెప్పేవారి దృష్టినిబట్టి మారుతూ వుంది. భౌతికవాదీ, ఆధ్యాత్మికవాదీ మానవుని తత్వాన్ని గురించి ఏకీభవించరు. మెకానిస్టులూ, వైటలిస్టులూ ఏకీభవించరు. శరీర శాస్త్రజ్ఞులకు అతను కళేబరం, మానసిక శాస్త్రజ్ఞులకూ, ఆధ్యాత్మిక వాదులకూ అతను శుద్ధ చైతన్యం: భౌతికవాదులకు అతను ఒక రసాయన పదార్థం. ఈవిధంగా విభజించి చూడటం మొదలు పెడితే యథార్థం తెలియదు. మానవుని నిజతత్వం తెలియాలి. అలా తెలిసే వరకూ, మనకు సరిపోయిన నాగరికతను సృష్టించుకోలేము, దాన్నబట్టి ఆధార పడవలసి వస్తుంది...

ఈ విధంగా మానవుని సంగతి తెలుసుకోవటం ఈనాడు ముఖ్యావసరం అయింది. ఇందుకు ఆధ్యాత్మికవాదులు ప్రయత్నించినట్టు కనిపిస్తుంది వారి ఊహాలు అన్నీ నిజాలుకాక పోవొచ్చు మన ఊహాలు మాత్రం అన్నీ నిజాలు అవుతున్నాయా? అందువల్ల ఆధ్యాత్మిక వాదాన్ని ఒక సిద్ధాంతంగా మాత్రమే నేను చూడగలుగుతున్నాను. ఆధ్యాత్మికవాదం అనగానే నీకు కలిగే అసహనం నాకు ఇప్పుడు కలగటంలేదు. అందులో మనంచేస్తున్నదానికి ఏమీ లేదని గాని, వున్నదంతా అస్పష్ట నిరోధక మేనని గాని, [illegible] అందులో మనకు పనికి వొచ్చేది ఏమీ లేదని గానీ నేను అనుకో లేకుండా వున్నాను. నేను ఆధ్యాత్మిక వాదాన్ని అంగీకరించను. కాని అవసరమైతే అందులో నాకు నచ్చిన భావాలను, నేను నమ్మిన సిద్ధాంతంలోకి తెచ్చుకోటానికి వెనుదీయవలసిన అవసరం లేదు అనుకుంటాను.

మానవుని పరిణామంలో భేదాలున్నాయనీ, ఎవరి సంస్కారానికి తగిన పనులు వారు చెయ్యాలనీ నేను అంటే ఈ ఉద్దేశం నీకు అభివృద్ధి నిరోధకంగా కనపడటం నాకు విచిత్రంగా వుంది. ఏమనిషైనా ఏపని పడితే ఆపని చెయ్యగలడనే నీ ఉద్దేశంలో పాటే నీకు అభిమాన పాత్రమైన రష్యాలో మాత్రం ఈ విధంగా జరుగుతూ వుందా? రష్యాలోనూ, రచయితలు రాజకీయ నేతలు, కార్మికులు, గృహకృత్యాలు నిర్వహించే వారూ వున్నారని నీవు అంగీకరిస్తావనుకుంటాను. ఈ విభజన వారివారి తాహతుని బట్టి జరుగుతుందనే విషయం కూడా నీవు అంగీకరిస్తావనుకుంటాను. అయితే వారిని ఇతరులు దోచుకోకుండా, వారు చేసేపని అకర్షవంతం గానూ, సులభంగానూ వుండేటట్టు చెయ్యగలం. వారు చేసేపని వారి పరిణామానికి అడ్డం రాకుండా, వారి అభివృద్ధికి దోహదం ఇచ్చే పరిస్థితులు కలిగించగలం. నేను చెప్పే ప్రతి దానిలోనూ ఏదో వొకటి వుందని కంగారు పడకు, నిదానించి ఆలోచించి చూడు.



# గ్రంథ పరిచయము

## పతిపూజ

శ్రీ సురేశ చంద్రమోహన భట్టాచార్య కృతము. ఆంధ్రానువాదకులు శ్రీ వోలేటి పార్వతీశంగారు. ప్రకాశకులు అడ్డేపల్లి అండ్ కో, రాజమహేంద్రవరము. పుటలు 187 వెల రూ. 2-0-0.

నానుము ఎన్నిదుష్కార్యము లొనర్చినను, తన్నెంత కష్టపెట్టినను, ఎన్ని అవమానముల పాలుగావించినను ఆతనియందు వైరభావమునుంచి చిట్టచివరకు ఆయనను సన్మార్గ నిరతునిగా చేసిన పతివ్రతా శిరోమణి కథ ఈ గ్రంథమునందు చిత్రింపబడియున్నది. వ్రతములు, దానధర్మములు, సంతర్పణలు మున్నగు సత్కార్యములు ఉత్తమ ధర్మము లేయైనను స్త్రీలకు మాత్రము విగౌణములనియు, పురుషునితో కలిసి ధర్మములాచరించుటయే పతి విధి యనియు గ్రంథము బోధించుచున్నది. కథానాయిక పతిభక్తి, దైవభక్తి, కష్టసహనము ఆత్మవిశ్వాసము మనలను ముగ్ధులను చేయక మానవు. భారతనారీలోకమునకు ఉన్న ఆదర్శము చూపు గ్రంథము.

అనేక గ్రంథములను రచించి, చిరకాలమునుండియు ఆంధ్ర సారస్వత సేవ చేయుచున్న శ్రీ ఓలేటి పార్వతీశంగారు, (వెంకట పార్వతీశ్వర కవులు) మనోహరమైన శైలిలో ఈ బెంగాలీ గ్రంథమును తెలుగులోనికి అనువదించి యున్నారు. అనువాదమైనను స్వతంత్ర గ్రంథముగా కనిపించుచున్నది. అచ్చటచ్చట పద్యములు గ్రంథమునకు శోభ చేకూర్చుచున్నవి. బెంగాలునందు వలె ఆంధ్రదేశమునందుకూడ ఈ గ్రంథము బహుళప్రచారము గాంచునని ఆశించుచున్నాము.

ఈ గ్రంథముయొక్క ద్వితీయ ముద్రణం గతమాసంలో జరిగింది. విశ్వదాత దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రపత్రికా ముద్రాక్షరశాలయందు ఈ పుస్తకాన్ని మొదట ఉచితంగా అచ్చువేయించియిచ్చారు.

* * *

## పాలేరు (నాటకం)

కర్త: శ్రీ బోయి భీమన్న. ప్రకాశకులు: దేశికవితామండలి, గవర్నరుపేట, విజయవాడ. వెల: రూపాయిన్నర.

ఈ సాంఘిక నాటకం మొదట 48 మార్చిలో ప్రచురించబడి గతమాసం తిరిగి ముద్రించబడింది.

* * *

## శ్రీ శివానందస్వామి

కర్త: శ్రీ పి. సుబ్బారామనాయుడు, బి. ఏ. బి. ఎల్. ప్రచురణ: వెంకటగిరి దివ్యజీవన సమితి. వెల తెలియదు.

* * *

## హుక్ వో (ర్) మ్ (ఇంగ్లీషు)

ప్రజారోగ్య కరపత్రం 6.

కర్త: డాll ఎల్. అడలిన్ స్టోన్ మద్రాసు ఆరోగ్యశాఖకు అసిస్టెంటు డైరెక్టరు. ప్రచురణ: మద్రాసు ప్రభుత్వ ప్రచారశాఖ.

* * *

## మహాత్మాగాంధి ఉపన్యాసములు—ఖలిఖుమత

కవి: శ్రీ అడ్డేపల్లి సత్యనారాయణ, ముండేపల్లి. ప్రచురణ: శ్రీఅనంతపల్లి సాంబమూర్తి చికాకోలు. వెల 1న్నరఅణా.

* * *

1. భీమావీజెంట్ల ప్రావోజలు, పాలసీ రిజిస్టరు.

2. భీమావీజెంట్ల కమిషను ఎకౌంటు రిజిస్టరు.

ప్రచురణ: జై. ఆర్. అండ్ సన్స్, 16/194, సత్యనారాయణపురం విజయవాడ.

* * *

## 'మాకొద్దీ తెల్లదొరతనము (పాట) ఆంధ్రరాష్ట్రము (జంగంకథ)

వెల: ఒక్కొక్కటి 2 అణాలు

కర్త: శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణ బి.ఏ., పిరపెరుమాళ్ కోయిల్‌వీధి, మైలాపూరు, మద్రాసు.

కాపీలు గ్రంథకర్తగారివద్ద దొరకును. వీనాడో ఆంధ్రులందరినోట మోగిన 'మా కొద్దీ తెల్లదొరతనము" అనేపాట ఇంతకాలానికి ప్రచురితమయింది. గతచరిత్రకు సంబంధించిన గేయమైన చారిత్రకంగా పరిగణించదగిన దీని, అందరూ చదవదగినది.

కొత్తగా రాసినదైనప్పటికీ ఆంధ్రరాష్ట్రం అన్న జంగంకథకూ నాగరికతకు చెందినది కామన్నది. [illegible] ప్రకాశంగారి భావాలు ప్రతిఫలించే ఈ రచన మద్రాసునేసుకుండా ఆంధ్రరాష్ట్రం రావలంతో కొలదాపాని చదువ కోగలదు.

* * *

## శ్రీ నాగమహేశ మునిజీవితచరిత్ర

ప్రకాశకులు: శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు. వెల: రు 1-4-0.

ఆంధ్రపత్రిక



ఆదివారం నవంబరు 20, 1949

సారస్వతానుబంధము

# విచ్ఛిన్న విభ్రాంతి

5

[ఫ్రైడా ఊట్లే సతి రచించిన "విచ్ఛిన్నవిభ్రాంతి" యను గ్రంథములోని యీ అయిదవ అధ్యాయమునందు మాస్కోనగరము నందలి పరిస్థితులను "నిత్యభుక్తికై జరుగుచుండెడి అనుదిన సంఘర్షణమును, ఆవాసముకొరకై అంతుపొంతులేని అన్వేషణయును, కమ్యూనిస్టు పక్షాభిమాన పూరిత విభేదభావమును" వివరించెను.]

కమ్యూనిస్టుపార్టీకి చెందని విద్యాధికుల విషయములో సోవియటు రష్యా ప్రభుత్వము అవలంబించిన భయానకవిధానమును మాస్కోలో మకాముచేసిన కొలదిదినములకే నేనవ్వా, జేసున్నా పసిపట్టగల్గితిమి. కమ్యూనిస్టుపార్టీ సభ్యులస్థితి తదితరులకంటె క్షేమకరంగానే యున్నది. ఏ అర్ధరాత్రి వేళనయినను "ఓగ్పూ" అనబడు రష్యను పోలీసు భటులు తలుపుకొట్టి ఎవరినైన పట్టుకొని పోగలరు. ఈ అవస్థ కమ్యూనిస్టులకుమాత్రము లేదు. సోవియటుప్రభుత్వము అవలంబించిన వ్యవసాయ విధానము మూలముగా దేశములో ఆహారధాన్యపు కొరత ఏర్పడింది. కాని, యీ దుస్థితికి కమ్యూనిస్టుపార్టీకి చెందనట్టి ఇంజనీర్లు, వ్యవసాయ వేత్తలు, శాస్త్రనిపుణులు, పరిపాలనాధికారులు, శాస్త్రవేత్తలు, పండితులు మొదలగువారే కారణభూతులని నిందించి వారిమీదనే నేరారోపణచేయుటకు ప్రభుత్వము ప్రయత్నించుచున్నది. ఏ శాస్త్ర ప్రవీణుడు ఎంతటి భక్తితాత్పర్యములతో ప్రవర్తించుచుండినను ఎంతకాలమునుండి సేవచేయుచుండినను అరెస్టుచేయబడుదు నన్న భయముతో నుండును. దేశములో ప్రబలియున్నటువంటి అన్నవస్త్రాలకొరతకుగాని, కాపురముండుటకు కొంపలు లేని కొరతకుగాని, సర్వత్ర విస్తరించి యున్న దుస్థితికి ప్రజా జీవిత భీభత్సానకు ప్రభుత్వాన్ని ప్రజలు నిందించకుండు లాగున హిట్లరువలెనే స్టాలినుకూడా కొందరు పాపాల భైరవులను సృష్టిపరచే వాడు.

ఈ "విధ్వంసకు"లే అందుకు బాధ్యులనియు, ప్రజల నిరంతరాధిక దౌర్భాగ్యస్థితికి "విదేశీయ బూర్జువాలును" ప్రజానీక ప్రాబల్యమునకును, సోషలిస్టు వ్యవస్థా నిర్మాణమునకును ప్రతికూలురగు పూర్వ జారుచక్రవర్తుల అభిమానపక్షమువారును నిందార్హులని రష్యను ప్రజలు నమ్మునట్లుగా జేయవలెను.

అందువల్లనే కమ్యూనిస్టుపార్టీకి చెందని శాస్త్రనిపుణులు అంతకంతకు ఎక్కువగా అరెస్టుచేయబడుచున్నారు. శాస్త్రనిపుణులు అనగా ఇంజనీర్లు, పండితులు, శాస్త్రవేత్తలుమాత్రమే కాదు. విద్యాధికులను వారందరు ఆ మాటలో చేరియున్నారు. లెక్కలు వ్రాయు కల్కారిణీలు, యంత్రవేత్తలు, ఉపాధ్యాయులు, వైద్యులు, పరిపాలనానుభవం గలవారు లేదా, వ్యాపార వ్యవహారములందును ఖజానా వ్యవహారములందును అనుభవంగలవారు పైజెప్పిన "నిపుణు"లు అనే వర్గములోనికి వస్తారు.

ఇక నాకు బందిఖానా సంప్రాప్తము కానున్న దనే భావము నాకు క్రమేణ కలిగింది—భర్తయైన ఆర్కాడి తిరిగి మాస్కోకు రావడం నిశ్చయమని నా మనస్సుకు నాటినకొలది నాకు గుండె జేజారైంది. 1927 సం|| లోను 1928 సం|| లోనుకూడా సోవియటు రష్యాలో జీవితమును గడుపవలెనని ఉవ్విళ్లూరుచుంటిని. కాని యిప్పుడు ఇచట నివసించుచున్నందుకై దిగులుపడుచున్నను, సోవియట్ జీవితము ఎంతటి ఘోరబాధలమయమైనదో వ్యక్తిగతంగా నాకు బోధపరచబడుచునే యున్నది.

1931 సంవత్సరారంభ దినముననే నా భర్తను రైలు స్టేషనువద్ద కలిసికొంటిని. దూరప్రాచ్య రాజ్యములలో పర్యటన చేసి వచ్చుచుండినందున ఆ జనవరి మాసారంభ దినమున చలిగాలి మూలంగాను, పొడిమంచు జడివాన మూలముగాను దేహము చలికి బంతవారి యున్నది. మేమిద్దరము అనాడు తిరిగి కలిసికొని నప్పుడు పరాయి వాండ్లవలె కలిసికోలేదు. కాని, ఒక టిన్నర సంవత్సర కాలము విడిపోయి యుండిన కారణముచేత తిరిగి పరస్పరము నేక విషయముల నెరుకపరచుకొనవలసిన వ్యక్తులవలెనే కలిసికొంటిమి.

సోవియటు రష్యా విషయములో నాకు ఉండిన భ్రాంతియంతయును త్వరితముగనే తొలగిపోవుచున్నది. ఆర్కాడీయూ సోవియటు తత్వాన్ని విశ్వసించుటకు సిద్ధమై యున్నాడు. ఇదివరకు వలెనే మేమిద్దరము, ఒక చిన్నగదిలో జీవితమును గడపుచున్నాము. కాని, నాకు రష్యా యెడల ఉండిన ఆశలు పోయినవి. అతడింకను ఆశలు పెట్టుకొనియున్నాడు. ఈ తేడాతో మేమిద్దరమును అగోచర మనోవియోగమును పొందియుంటిమి.

అతడు రష్యాకు తిరిగి రాకపూర్వమే నేను అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థలో చేరి పనిచేయుచుంటిని. అతడు ప్రోమెక్స్పోర్టు పనిచేయ నారంభించెను. ప్రతిరోజు సాయంకాలము నేను ఇంటికి వచ్చిన పిమ్మట అనేక మాటలు అయనతో హేళనగా పల్కుచుండేదానను, సోవియటు రష్యా ప్రభుత్వపు "సోషలిస్టు" ప్రజా క్షేమావస్థా నిర్మాణమును చూడగా చూడగా క్షామావస్థా నిర్మాణముగా నున్నదని చెప్పితిని. అతడు తన పనిలో తాను నిమగ్నుడై, నాతీవ్ర కర్కశ విమర్శలకు చెవియొగ్గడివాడు కాదు.

మా ప్రేమ మాత్రము తొలగిపోలేదు. కాని, పూర్వపు చనవు మాత్రము తగ్గింది. ఉభయులము ఒకే విధమైన అభిప్రాయ సిద్ధాంతములుకలవారమగుటచేత జోడుకలిసితిమి. కాని, కేవలము భార్తృ సౌఖ్యమునకై కలియలేదు. ఇప్పుడిక నాకు అయనకు సమానాభిప్రాయ సిద్ధాంతములు ఏమిన్ని లేవు. మేము అంధప్రాయంగా ఏ నరక కూపములో బుద్ధిపూర్వకముగా ప్రవేశించితిమో, ఆ నరక కూపంలో మేము ఒకరికొకరు శరణ్యముగా పరస్పరముగా ఆకర్షింప బడుటలేదు. మా అన్యోన్య సంపర్కములో నుండిన సరదా అంతయును అంతర్ధానమైనది. కాని,సుఖోపశమనానికి ఆనాటి సరదా మరోకమారు మా ఇద్దరి మధ్య ఉత్తరోత్తర తల ఎత్తవలసిన రోజులు కలవు.

నాకు ప్రతిరోజున్ను ఆఫీసు పని పూర్తియైన పిమ్మట, ఆహార వస్తువుల కొరకు వేట, కాపుర ముండుటకు తగిన గదికై అన్వేషణ నిత్యవిధిగా ఏర్పడినా జవసత్వములన్నియు అందుకే ధారవోయ వలసి వచ్చుచుండెను. రష్యను ప్రజలలో విశేష సంఖ్యాకులు ఏ రీతిగా బ్రతుకు తెరువుకై అగచాట్లుపడుచున్నారో నేను కూడా ఆ సామాన్య ప్రజాదశలోనే యున్నాను. ఈ జీవితపు ఆరాటం అనాది ఆనాగరిక యుగము నాటి మానవ జీవిత ప్రాణావసరమునైన కొంపకు కూటికి సంబంధించిన ప్రాకులాటనై యున్నది.

నోవిన్స్కీ బోలివార్డునందొక గదిని అద్దెకు సంపాదింపగల్గితిని. ఆ యింటి ఖామందొకప్పుడు "పాటెమ్కిను" అను సుప్రసిద్ధ నావపై నావికుడుగా పనిచేసి యుండెను. ఆ నావలోని నావికులు 1905 సం||లో తిరుగుబాటు చేసియుండిరి. అతడు లండనులోని రష్యను ప్రతినిధి కార్యాలయములో యిప్పుడు పనిచేయుచున్నాడు. అతని కుమార్తెలిద్దరును వాళ్ళొకగదిని, "బాజారు రేటుకు" నాకు అద్దెకీయగల్గిరి. ఆ మాటకు అర్థమేమిటంటే, ఆ మేడలోని ఆ అంతస్తున కంతటికీవారు ఎంత యిస్తున్నారో, నేను ఆ ఒక్కగదికి అంతకంటె ఎక్కువ చెల్లించుచుంటిని.

ఇంటి ఖామందుయొక్క పెద్దకుమార్తెయైన జేనియా, రష్యాలో ఇప్పుడేర్పడుచున్న శ్రీమంతుల వర్గానికి నమూనాగా ఉంటుంది. సొగసైన దుస్తులు వేస్తుంది. ఖులాసాగా జీవితభోగములు అనుభవిస్తుంది. ఆమెకు ఉద్యోగంకూడా ఉంది. ఆమెకు ఉన్న ఆదాయంలో ఆమె ఉద్యోగసంపాదన సగంవంతుకూడా లేదు. ఆమె ఒకగదిని అద్దెకు యివ్వడమే కాదు. ఆమె తండ్రి మాస్కోనగర సోవియటు నందు (పరిపాలక పంచాయితీ మండలిలో) మెంబరు అగుటవల్ల అతనికి అందరికంటె రేషనులెక్కలో ఎక్కువగా సప్లయి చేయబడు కోడిగుడ్లు, వెన్న తదితర భోగ్యవస్తువులను ఆమె బజారు వెలకు (బ్లాకుమార్కెటు రేట్లకు) అమ్ముతూ ఉంటుంది.

అతడు లండనులోనే ఉంటూ ఉన్నప్పటికీ, జేనియాయొక్క సవతితల్లికూడా అతనితోనే ఉంటూ ఉండినప్పటికీ, ఇక్కడ మాస్కోలో అతని రేషనుకార్డులో అందువల్ల తగ్గించబడినది ఏమిన్ని లేదు పదిరోజుల కొకసారి జేనియాకు రేషను కార్డు ననుసరించి 11 పౌనుల వెన్నను, విశేషంగా కోడిగ్రుడ్లను ఇచ్చేవారు. ఆమె వాటికొరకై చెల్లించిన కిమ్మతుకంటె అయిదురెట్ల కిమ్మతుకు బ్లాకుమార్కెటులో ఆమె వాటిని అమ్ముటవల్ల ఆఫీసులో గుమాస్తాపనిచేసి ఆమె సంపాదించే దానిలో సగంకంటె మించి గడించగల్గేది.

1931 సం|| వేసంగిలో జేనియా యొక్క తండ్రి మాస్కోనగరానికి తిరిగి వచ్చాడు. దురదృష్టవశాత్తు మేము అగది ఖాళీచేసి పోవలసివచ్చింది. "లంకుషైరు–దూరప్రాచ్యం" అనే నా మొదటి గ్రంథమును లండనులో ప్రచురించుటకై అప్పట్లో నేను కొన్ని ఏర్పాట్లు చేయుచుంటిని.

1931 సం|| సెప్టెంబరు మాసములో నేను తిరిగి మాస్కోకు వచ్చేసరికి, నా భర్తయగు ఆర్కాడీగారు సుఖారెవిస్కీ మార్కెటువద్ద కొలది సౌకర్య వసతులుగల కొత్తగదిలోనికి తన మకాము మార్చియుండెను. ఈ గదికిన్ని, ఇంటివారితోబాటు వంటగదిని స్నానాలగదిని ఉమ్మడిగా వాడుకొనేటందుకున్ను మాసానికి 100 రూబుల్సు అద్దెను యిస్తున్నాను. నా భర్త ఆర్కాడి సంపాదన యను 300 రూబుల్సు- నా సంపాదన 275 రూబుల్సు- ఈ సంపాదనలోనుంచి ఆ అద్దెను చెల్లిస్తున్నాము. కాని, మాకు గది యిచ్చిన ఆసామీ తాను తీసికొన్న 3 గదుల అంతస్తుకు యావత్తుకు 45 రూబుల్సు నెల 1 కి అద్దెయిస్తున్నాడు. ఊళ్ళో ఉన్న అద్దెలనుబట్టి చూస్తే మాది చౌకయని చెప్పవలసినదే. ఇతరులు మాకంటె హెచ్చు అద్దెలనే చెల్లిస్తున్నారు.

కొన్ని పాతకాలపు గదుల పద్ధతిగల ఇండ్లలో అయిదులేక ఆరు కుటుంబముల వారు కలిసి, ఒక్కటే వంట యిల్లును జాయింటుగా వాడుకొనుచున్నారు. ఇదివరకు లండనులోని ఆర్థిక శాస్త్ర విద్యాలయంలో నాకు పరిచయుడైన ఒక రష్యను యువకుడు, తన భార్యతోను బిడ్డతోను ఒక మేడమీద ఒక గదిలో కాపురముంటున్నాడు. ఆ అంతస్తుమీదనే కాపురముంటున్న ఇంకా 25 మందితో కలిసి జాయింటుగా ఒకటే స్నానాల గదిని, వంటగదిని వారు వాడుకొనుచున్నారు.

ఒక్కొక్క గదిలో విడిగా కాపురముండేటి కాపురాలవారికి చాలామందికి సొంత నవుకర్లు ఉన్నారు. ఈ నవుకర్లు ముగ్గురు లేదా నలుగురు కలిసి వంటగదిలోనే ఒకరి ప్రక్క నింకొకరు నేలమీదనే పరుంటారు. లేదా వంటగదిలోని మేజాబల్లమీద పరుంటారు. వారిమీద రాత్రిళ్లు నల్లులు ప్రాకుతూ ఉంటాయి. అక్కడ వుండే జనసమ్మర్దం మూలంగా తేయాకు కాచుకొనుటకుగాని ముఖం కడుక్కొనుటకై రవ్వంత వేడినీళ్లు కాచుకొనుటకుగాని వంటగదిలోనికి పోవుటకు సంకోచించవలసి వస్తుంది.

ఈ పనికత్తెలకంటె, వారి యజమానులు కొంచెం హెచ్చుస్థితిపరులు నలుగురు ఏక కుటుంబముగా ఒక్క గదిలో కాపురము ఉంటూ వుండి, సరియైన తిండిలేక జీవిస్తూ ఉన్నప్పటికీ, ఆహార వస్తువులను కొనుక్కొనే షాపులవద్ద, ఒక లైనులో నిలువబడి నిరీక్షించి నిరీక్షించి కావలసినవి కొనుక్కొనుటకు తమ తరపున మనిషిని పంపవలెను. అందు నిమిత్తమై యీ పనికత్తెను పెట్టుకుంటారు. రేషను కార్డు ప్రకారంగా యివ్వబడే స్వల్పవస్తు సామగ్రికూడా దీర్ఘకాలం వేచియుండిననే గాని లభ్యంకాదు. ఈ రేషను షాపుల చుట్టూ తిరుగుటయున్ను, రేషనులేకుండా అప్పుడప్పుడు కొన్ని షాపులలో లభింపగల ఆహార వస్తువులకై వేటాడుటయున్ను ఒక మనిషికి రోజంతా పని కల్పించును.

పెద్ద పెద్ద అంతస్తులను ఏకంగా అద్దెకు తీసికొన్న కమ్యూనిస్టుపార్టీ మెంబర్లు, తమ పనికత్తెలు పరుండుటకు ప్రత్యేకంగా ఒక గదిని ఏర్పాటు చేస్తారు. నాలుగైదు గదులు మాత్రమే అద్దెకు తీసికొన్న కుటుంబమువారు కూడా తమ పనికత్తెకు వంటగదిలో పరుండుటకు చోటు చూపిస్తారు. లేదా, ముందరిద్వారం వద్దనే ఒక గనముంచెవలె నవుకర్లు ప్రత్యేకంగా నిద్రించుటకై ఈ కొత్తకాలపు మేడల అంతస్తులన్నింటిలో నిర్మిస్తున్నారు.

అక్టోబరు మాసంలో కాకేసను ప్రాంతంలోని గాగ్రివద్ద ఒక విశ్రాంతి భవనంలో కొంత నివాసయోగ్యమైన భాగమును (పూటెకాస్) మేము కిమ్మతు ఇచ్చి సంపాదించగల్గితిమి. గ్రీకు పురాణములందు చెప్పబడిన జేసను అను వీరుడు ఇక్కడనే మీడియా అను రాచకన్నెను వరించెను. ఇచటనే అతడు కుందనపు గొర్రె ఉన్నెను సంపాదించెను. ఈ ప్రాంతానికివచ్చిన మేము నిశ్చింతగా కాలక్షేపము చేయగలిగితిమి. జపానులో ఉన్నప్పుడు మేము సుఖంగా కాలక్షేపం చేసిన అనంతరము తిరిగి ఇక్కడనే కాలక్షేపం చేయగలిగితిమి.

తిరిగి మాస్కోనగరమునకు చేరితిమి. తిరిగి గదికొరకై వెదకుట ప్రారంభించాము. గదికొరకై చాలకాలము క్రిందటనే అడ్వాన్సు యివ్వడమున్ను చాలా కాలం క్రిందటనే మాకు వాగ్దానములు చేయబడుటయున్ను జరిగింది. ఆర్కాడీ ఆశలుపెట్టుకొని, ఆశలుపెట్టుకొని, నిరాశ జెందుచున్నాడు. అటువంటి స్థితిలో నాపేరుతోనైనను ఇంటికై వేటసాగిస్తే ఫలిస్తుందేమో అని ప్రయత్నం సాగించాము. నేనింకా బ్రిటిషు కమ్యూనిస్టుపార్టీలో సభ్యురాలనే గనక నాకు ఇల్లు లభించడానికి ఎక్కువ అవకాశము లున్నాయి. కాని దురదృష్టవశాత్తు నేను అలెగ్జాండ్రోస్కీ రైలుస్టేషనువద్దనున్న గ్రుజిన్స్కీలో వైద్యకార్మిక గృహనిర్మాణ సహకార సంస్థయందు నేను సభ్యురాలినైతిని. ఆ దినములలో వైద్యకార్మికులు ప్రభుత్వాదరణ పాత్రులయిన వర్గములోని వారు కారు.

అనంతర సంవత్సరములందు నాకు ఒక్క మేడమీది భాగమైనను అద్దెకుదొరకలేదు. ఆర్కాడి చిట్టచివరకు తన కొక భాగమును సంపాదించినప్పటికీ, అంతకు పూర్వపు సంవత్సరాలలో అడ్వాన్సుగా నేను చెల్లించియుండిన 4,500 రూబుల్సు నాకు వాపసు కాలేదు.

ఇక్కడ యింటికొరకై మేము పడుచుండిన అవస్థలను నా తల్లికి నేను వ్రాయుచుండిన ప్రతి ఉత్తరములోను వివరించి కొన్ని రోజులవరకు వ్రాయుచునే యుంటిని. వచ్చేవసంతం ఋతువులో ఇల్లుదొరకవచ్చుననే ఆశ ఒక పర్యాయము, ఆటు తరువాత శీతాకాలంలో దొరకవచ్చునని మరొక ఆశ, అటు పిమ్మట వచ్చేసంవత్సరం దొరకవచ్చునని ఇంకొక శ్రమ-

# సోవియట్ రష్యా నిజస్వరూపం

రచన: ఫ్రైడా ఉట్లే



లండను విశ్వవిద్యాలయంలోని మాక్మిలన్ మందిరంలో 'ఇండియాలీగ్' వారు ప్రధాని నెహ్రూ గౌరవార్థం విందుచేశారు ఆ సందర్భంలో రోజ్ టైలర్ అనే 6 సంవత్సరాల బాలిక తన పుస్తకంలో చేవ్రాలుచేయవలసిందిగా ప్రధానిని కోరింది. ఆదరంతో ఆ బాలిక ముచ్చట తీరుస్తున్న నెహ్రూ ప్రధాని.



జెకోస్లావియా రాయబారి డాక్టర్ బహుస్లాక్రటోచ్విల్ నవంబరు 18 వ తేదీ ప్రధాని నెహ్రూను సందర్శించారు.



అమెరికా, కన్సాస్ నగరంలోని చిత్రకళా ప్రదర్శనశాల - దీన్లో యీజిప్టు, గ్రీస్, రోమ్ మొదలైన దేశాల కాంస్య శిల్పాలెన్నో ప్రదర్శనలో వున్నయ్. ప్రసిద్ధ ప్రాచ్యచిత్రాలుకూడా అనేకం వున్నాయి.



కోత పండుగ—సౌతువాక్ (ఇంగ్లండు) ప్రజల విచిత్ర వేషాలు

# ఏది? ఎవరు? ఎప్పుడు?

నిద్రరావటంలేదు. ఒక కథ చెప్పమని తాతయ్యని అడుగుతే చెప్పకపోతాడా అనుకొని నేను, పొడుగాటి చుట్ట ఒకటి కాలుస్తూ పెయ్యికి మేత వేస్తూవున్న తాతయ్యదగ్గరకు వెళ్లి అడిగాను. "తాతయ్యా! తాతయ్యా! ఒక మంచి కథ చెప్పమా" అని. మా తాతయ్య పని పూర్తి చేసుకొని "బాగా విను" అంటూ ప్రారంభించాడు. మా తాతపేరు టాల్‌స్టాయ్.

అనగా అనగా ఒక రాజు వుండేవాడు. ఒకనాడు ఆ రాజు ఏదో ఒక విషయం గురించి ఆలోచిస్తూ వుండగా తలపని తలంపుగా తన బుర్రలోకి మూడు ప్రశ్నలు వచ్చాయి. ఆ ప్రశ్నలకు సమాధానాలు కావలసి వచ్చేయి. అవి ఏమిటంటే, మొదటిది - ఏ పనికైనా ఏది మంచి సమయం? రెండవది - ఆ పనికి తగినవాళ్లు ఎవరు? మూడవది-ఉన్న పనుల్లోకి ఏ పని ముందు చెయ్యాలి? ఈ మూడు ప్రశ్నలకు తగినటువంటి జవాబులు చెప్పిన వానికి పెద్ద బహుమానం ఇస్తానని దేశదేశాలలో ప్రకటించాడు. అనేక రాజ్యాల నుంచి అనేక రకరకాల జవాబులొచ్చాయి. కాని మనరాజుకి అందులో యే ఒక్క జవాబు నచ్చలేదు. రాజుకి మాత్రం యీ ప్రశ్నలపట్ల అంతకంతకూ పట్టుదల హెచ్చవుతుంది. సాధారణంగా మనలో- తెలివి తేటలకి, వేదాంతానికి సన్యాసులు, సాధువులు గొప్పవారని అంటూవుంటారు. ఆ విధంగానే, మన రాజుకూడా ఆలోచించి, ఆలోచించి ఒకమంచి తెలివి తేటలుగల సన్యాసినిపట్టు కున్నట్లయితే మన ప్రశ్నలకు తగిన జవాబులు దొరకక పోతాయా అనుకుంటూ, పేరుపొందిన ఒక సన్యాసిని అడుగుటకు నిశ్చయించుకున్నాడు.

ఆ సన్యాసి దూరంగా ఉన్న ఒక అడవిలో వుంటాడు. మామూలు మనుష్యులకు తప్ప, రాజులు, అలాంటి గొప్ప వాళ్లకి దర్శనం ఇచ్చేవాడు కాదు. ఆ సంగతి మన రాజుకి తెలుసును. అందుచే రాజుకి మల్లే తయారు కాకుండా, మామూలు మనిషిలాగ తయారయి సన్యాసి ఆశ్రమానికి బయలుదేరాడు. యింకా ఆశ్రమం ఒకటి రెండు ఫర్లాంగులు వుండగానే గుర్రం దిగి రక్షక భటుల్ని అక్కడే వుంచి, సన్యాసివద్దకు ఒంటరిగానే నడిచి వెళ్లేడు.

ఆ సమయంలో సన్యాసి తన ఆశ్రమం ముందు మట్టి తవ్వుతున్నాడు. రాజును చూసి ముసిముసి నవ్వు నవ్వి మళ్లీ తనపని సాగించాడు. సన్యాసి ముసలివాడు గనుక ఆ మట్టి తవ్వడంలో చాలా అయాసపడేవాడు. రాజు సన్యాసివద్దకి వచ్చి అప్పటికే చాలా కాలమయ్యేను. యిక రాజు వుండబట్టలేక సన్యాసివద్దకు వచ్చి:

"స్వామీ, నేను మీవద్దకు మూడు ప్రశ్నలకి జవాబుల కోసం వచ్చాను. అంటూ తన మూడు ప్రశ్నలు తెలియజేస్తాడు. సన్యాసి మాట్లాడక ఊరుకున్నాడు.

రాజు సన్యాసి అలసిపోవటం ఓర్వలేక "మీరు చాలా అలసిపోయారు. ఆ గునపం నాచేతి కిచ్చి మీరు కొంచెం విశ్రమించండి" అన్నాడు. సన్యాసి సంతోషంగా ఆ పనిని రాజుకి వప్పచెప్పేడు.

కొంచెంసేపైన తర్వాత రాజు తన పనిని కొంచెం ఆపి మళ్ళి తన ప్రశ్నలకి సమాధానాలు అడిగేడు. సన్యాసి ఏమీ జవాబులు చెప్పక "నీవు విశ్రాంతి తీసుకో, ఆ పని నాకియ్యి" అన్నాడు. కాని రాజు తన ముసలాయనకు ఏమైన కష్టం కలగగలదనే భయంతో తానే తవ్వడం ప్రారంభించేడు.

అంతకంతకూ సూర్యాస్తమయం కావస్తుంది. రాజు ఆఖరుసారి గునపం నేలలో గుచ్చి, పని వుండబట్టలేక, "స్వామీ, మీ దగ్గరకు నా ప్రశ్నల సమాధానాల కోసం వచ్చాను. దయచేసి త్వరగా చెప్పినట్లైతే నేను ఇంటికి వెళ్ళిపోతాను ప్రొద్దుపోకుండా" అన్నాడు.

సన్యాసిరాజు అనిన మాటల్ని విని వింటున్నట్టు "అదుగో చూడు. ఆ వైపునుంచి ఎవరో పరుగెత్తుకుని వస్తున్నారు. ఎవరో చూద్దాం" అన్నాడు.

రాజు సన్యాసి చెప్పిన ప్రకారం ఆ వైపుకు చూశాడు. ఎవరో గడ్డపు మనిషి కడుపును చేతులతో వత్తుకొని పరుగెత్తుతున్నాడు. ఆ మనిషి, రాజు, సన్యాసి వున్న చోటుకి వచ్చి మూలుగుతూ నేల మీద పడిపోయాడు. రాజు ఆ మనిషి కడుపునుంచి వస్తున్న రక్తాన్ని కనిపెట్టి, ఆ మనిషి దుస్తులు కొంచెం సడలించేసి, తన గుడ్డలతో ఆ గాయాన్ని తుడిచి నుంచి కట్టుకట్టి రక్తాన్ని ఆపేడు. ఆ మనిషి "దాహం" అన్నాడు. రాజు సంభ్రమాయిన మంచినీళ్లు ఇచ్చాడు.

చీకటిగా వున్నందున ఆ రాత్రికి రాజు సన్యాసి ఆశ్రమంలోనే పడుకొన్నాడు. తెల్లవారేసరికి బాగా ఎండ వచ్చింది. గడ్డపు

# గుజ్జనగూళ్ళు బిచ్చికగూళ్ళు

మనిషి రాజు వంక చూస్తూ "నన్ను క్షమించు" అన్నాడు.

రాజు: "నిన్నెందుకు క్షమించడం" అన్నాడు.

గడ్డపు మనిషి "నేనెవరనో నీకు తెలియదు. నీకు పరమశత్రువును. నువ్వు ఎవరినైతే చంపి అతని రాజ్యం తీసుకున్నావో అతని తమ్ముణ్ణి నేను. నువ్వు ఒంటరిగా సన్యాసియొద్దకువచ్చావని నాకు తెలుసును. నువ్వు తిరిగి వెళ్ళేటప్పుడు నిన్ను

**శ్రీమతి అనంత అమ్మాజీ**

చంపుదామనుకున్నాను. కాని నీ రక్షక భటులు నన్ను గుర్తుపట్టి గాయపరచారు. యిప్పుడు నీవు రక్షించకపోతే నేను చచ్చిపోయేవాడిని. నీవు చేసిన ఉపకారానికి నేనెలా సహాయపడగలను? అందుచేత ఈరోజు మొదలు నేను, నా పరివారమంతా నీకు దాసులుగా ఉండగలరు. నన్ను క్షమించు" అన్నాడు.

రాజు బయటకువచ్చి సన్యాసిని చూసి "స్వామీ! ఆఖరుసారి మిమ్మల్ని వేడుకుంటున్నాను" అన్నాడు.

"నీకు సమాధానాలు అప్పుడే వచ్చాయిగా" అన్నాడు సన్యాసి.

రాజు ఆశ్చర్యంతో "ఏమిటి! సమాధానాలు వచ్చినాయా! ఎల్లాగస్వామీ?" అన్నాడు.

సన్యాసి అన్నాడు: నిన్న నన్ను చూసి జాలిపడి మట్టి త్రవ్వక నీదారిని నీవు పోయినట్లయితే ఈగడ్డపుమనిషి దారిలో కాసి నిన్ను చంపి ఉండేవాడు. అందుచేత మట్టి త్రవ్వే సమయం చాలామంచిది. అప్పుడు నేను సరియైన మనిషిని. నాకు మంచి చేసి సహాయపడడమే నీకు ముఖ్యమైనపని. తరువాత ఆగడ్డపు మనిషి మనదగ్గరకువచ్చిన సమయం మంచిది. నీవు అతనిగాయాన్ని కడుతూ సపర్య చేయడంవల్ల సరియైనమనిషి అతడే. అన్నిటికంటే ముఖ్యమైనపని అతనికి సేవచేసి ప్రాణం కాపాడడమే. అందుచేత మనకి ప్రతిసమయం మంచిదే. ఎదురుగా ఉన్నవాడే సరియైన మనిషి. చేతులో ఉన్నపనే ముఖ్యమైనది. ఆ పని పూర్తి చేయకముందు రెండవపనికి పోకూడదు తెలిసిందా.

సన్యాసి చెప్పిన నీతి రాజుకి నచ్చింది. దానికి ప్రతిఫలంగా పెద్ద బహుమానం ఇస్తానన్నాడు. కాని సన్యాసి వద్దన్నాడు. శత్రువులు స్నేహితులయ్యారు.

తాతయ్య కథ పూర్తిచేస్తూ "కథ కంచికి మనం మంచంమీదికి" అన్నాడు.



పెళ్లికి ముందు — తరువాత

# నక్క వెంకయ్య

ఒకానొక అనగా ఒక వూరిలో వెంకయ్య అనే వాడుండేవాడు. అతడు మహాయుక్తిపరుడు. అందువలన అందరు అతనిని "నక్క-వెంకయ్య" అని పిలుస్తూ ఉండేవారు. ఎంతటి వాళ్లనైనను మోసముచేయు సామర్థ్య మతని కుండెను. ఆవూరిలో కూరగాయ లమ్ముకొను వర్తకుడు చాల గడుసువాడని పడుపేరు యుండెను. అతనిని ఎట్లయినను మోసగించవలయునని వెంకయ్య పట్టుపట్టెను.

వర్తకునివద్ద ఎవరు వంకాయలు కొనినను సగము మంచివి, సగము పుచ్చువి! ఎవరైనను "అదో! ఆ వంకాయ పుచ్చు" అని యనిన గొణుగుచు మరల "ఆ ఆ ఏమిటి! ఆ వంకాయ పుచ్చు! ఎవడు చెప్పాడు!" అని ఘర్జించును. అంతే పిదప రచ్చ, దెబ్బలాట. లేకున్న వంకాయలు అమ్ముటలేదని గాని, లేవని గాని చెప్పి పంపుచుండెడివాడు.

ఒకనాడు "నక్క-వెంకయ్య" ఆ వర్తకుని అంగడికివచ్చి, "నాకు ఒక పెద్దకష్టము వచ్చి పడిందని" చెప్పాడు.

"ఏమిటయ్యా ఆ కష్టము."

"ఏంలేదు, ఏదో మందుకట మంచి పుచ్చువంకాయలు ఏర్పరచి వెం

**గొల్లపూడి శారదాదేవి**

టనే తీసికొని రమ్మన్నారు. డాక్టరు పుల్లయ్యగారు." అని విచారపడుచున్నట్లు నటించాడు. "అంతేనా! ఏమిటో అనుకున్నాను! ఇదిగో యీ వంకాయల్లో పుచ్చులన్నీ ఏరిస్తాను పట్టుకెళ్లు!" అని తొందరగా పుచ్చులన్నీ యేరి యొక మూల పెట్టెను. అన్నిఏర్పరచిన తరువాత వెంకయ్య కొంచము దూరములో వంకాయలకొరకై వేచి యున్న తన స్నేహితులను కనుసైగతో దగ్గరకు పిలిచి "అబ్బే! యిన్నీ పుచ్చు వంకాయలేనా! సరేమాకు పుచ్చు వంకాయలేవద్దు. మంచి వంకాయలు వీశెడు తూచిపడేయమని" నెమ్మదిగా అన్నాడు. దగ్గరనున్న వారందరు "మాకొక వీశె! మాకొక వీశె. "అదిగో ఆకుప్పలో వున్న పుచ్చుకాయ ఒకటికూడ వద్దు" అనుకుంటూ చుట్టుకొన్నారు.

వర్తకునికి ఏమి చేయుటకు తోచినది కాదు. కడుపుకట్టుకొని నవ్వుమందన్న వెంకయ్యను తిని నేయునట్లు చూచుచుండెను. ఈవిధముగా వెంకయ్య "నక్క-వెంకయ్య" అనే పేరును యింకా బాగా సార్థకము చేసికొన్నాడు.

న్యూయార్కు-ప్రజల అభినందన లందుకుంటున్న నెహ్రూ

వ్యంగ్యరచన

# పనికిరాని మనిషి

నేనేమీ తప్పుచేయడంలేదు.

అలా గనకపోతే మరేలాగంటావులే.

ఎలాగేమిటి నీ ముఖం. ఇందుకనే నిన్ను చూస్తే నాకు కోపంవస్తుంది. నీకు కావలసిఉంటే నా దగ్గరకు వస్తావు. వచ్చి ఆ సరుకుఉందా అని అడుగుతావు. నాదగ్గర ఉంటే నీకిస్తానంటాను. దాని ధర ఎంతంటావు. ఇంతని చెప్తాను, నీకింతకు కావాలని బేరమాడుతావు. కుని తగవుగా ఎంతకో ఓఅంతకు కుదుర్చుకుంటావు. పదుచ్చుకుని పుచ్చుకుంటావు. ఇక ఇంతేకదా మేము చేసే వ్యాపారమంతాను. ఇందులో నా తప్పేముంది? నీ కిష్టమైంది ఇలా కష్టంలేకుండా ఇచ్చినందుకా పైపెచ్చు నామీద పరువునష్టంకలిగే పదాలు ప్రయోగిస్తావు.

ఏదోలేరా స్నేహితుడవని అన్నాను. మరయితే నీ తప్పేమీ లేదంటావా? (సందేహంగా)

అదిగో మళ్ళీ మొదటికే వస్తున్నావు.

అవునులే నీతప్పేముంది. మనందరికీ పైనఉన్న మనదేవుడు నలువు. ఆయనగారి క్రిందవున్న ఈ ఆకాశం నలువు. దాని అడుగునఉన్న మనం నలువు. మరి మన మరుగునఉన్న మన వ్యాపారమూ నలుపే. ఇక దాని పొరుగునఉన్న మాబోటివాళ్ళ పనే.........

ఆ ఎలాగుండేదేమిటి?

ఎలాగుండదను మిత్రమా! మీరు ధన ధృవాలు. మేము ఋణధృవాలు. ఇవి రెండూ కలిస్తేనేగాని విద్యుత్తు ప్రసరించదు. మరి మీ వ్యాపారమూ సాగదు. మ మాపనీ నడవదు.

శహబాష్! బలేగా చెప్పావోయ్.

ఎంత బాగా చెప్పితే ఏం? మా మాటలకు మీ ధరలు లేవు.

అదిగో మళ్ళీ మొదటికే దిగుతున్నావు. జగనియ్యకయ్యా బాబూ దిగనియ్యి. ఎంతలోతుకు దిగగలనో చూడనియ్.

ఇలాంటి చవటకబుర్లే చెప్పొద్దన్నాను. జ్ఞానాను, మరచిపోయాను. లాభం లేకుండా కబుర్లు మాబరాగా ఖర్చు చేయకూడదు.

ఆ అలా నేర్చుకో బాగుపడతావు.

అవునోయ్. నీవద్ద కొన్నాళ్లు శిష్యరికం చేసి పొందాలి. అలా చేస్తేనేగాని మా కష్టాలన్నీ చక్కబడేటట్లు లేవు. ఏమంటావ్ బ్రదర్! సరుకు నిలవ చేస్తాను. ఎవ్వరు వచ్చినా లేదనేస్తాను. అసలది నాదగ్గర ఉంటేగా. గోదాములలో ఉండి. అవి బాగా నిలవబడి పోయి, పురుగులు పట్టి పాట్టి పోయి ముక్కి పోయి. ముక్కియి ఎందుకూ పనికిరాని దిబ్బెదాక ఉంచుతుంటారు. అసలవి ఎంత కుళ్ళిపోతే అంత మంచిది. భూమికి ఎంత కుళ్ళిన ఎరువు వేస్తే అంత గుణం ఇస్తుంది. అదే చక్కని ఎరువు. ఈ ఎరువునీ ఇలా తలంలోని ఈ జనాభా కలిపి దీరమేసే సింహంచే ఏంటి గట్టి ఇనపకడ్డీ అయిపోతుంది! అందుకనే బోలెడన్ని సరకులు, ఈ స్టోర్సులలో విడుదల చేయబడకుండా అలా దాచబడతాయి! ఇక ఈ సరుకు ఫలహారంలా పంచి, పెడతాను. అందరూ ఒక్కసారి అడిగితే నేనొక్కణ్ణుంచి తీసుకుంటాను. ఎవరికి శక్తి ఉంటే వాళ్ళు కొనుక్కుంటారు. మరి ధర కొస్త ఎక్కువగానే ఉంటుంది. శిల్పంకోసం. ఇంత పుష్టి గల ఆహారం తిండు వ్యాపారం కోసం నాకు ఎంత వడ్డీ నష్టం కానీను, ఎన్నాళ్ళు గోదాముల అద్దె నష్టము కానీను. ఇక అనేక రకాల తెగుళ్లూ ? ....

చూసుకోండి. ఏంమటావ్ సాహుకార్?

అంతేనోయ్. అంతే కాని, ఇంకో పెద్ద విషయం మరచి పోయావు. ఇన్నాళ్ళూ నీవనుకునే పాని లేకుండా కాపలా గాసిన వాళ్ళ మాటేమంటావు?

ఓ యస్. మరచి పోయాను. దానికే ముంది. వాళ్ళ మామూలు మామూలుగానే ఇచ్చేద్దాం. ఇంతకీ ఏ గాడి క్రింద పంది కొక్కు ఆ గాడి క్రింద బ్రదక్క చస్తుందేమిటి. పోనియ్య బోయ్ పోనియ్. ఎలా బ్రతికే వాళ్ళ నలా బ్రతకనియ్. మనకు కావలసింది బ్రతకటమేగా కోటి విద్యలూ కూటి కొఱకే. పొట్టకోసం కోసం పడరాని పాట్లు పడాలి. ఈ సక్కుడు ప్రాణం ఇలా ఈ గొంతుకలో కూరుక పోయి ఉన్నంత కాలం ఏదో విధంగా కక్కుర్తి పడక తప్పదు.

**శ్రీరంది సోమరాజు**

నిజం చెప్పావురా కాని, తీరా ఇన్ని జులుములు వదలి, ఎన్నో కేసుల జుల్మానాలు అన్నీ తీరిన తరువాత మనకు మిగిలేది హాళ్ళికి హాళ్ళి సున్నకు సున్నే.

అవునోయ్ అవును ఈ శరీరం దేనికి చెప్పు. పరోపకారం కోసమేగా. మనకు మిగులు వుందని మొదట్లో అనుకున్నామా ఏమిటి? ఒకప్పుడు మిగుల్తుంది. ఒకప్పుడు తగుల్తుంది. ఇలా చూశావు నాకింకోమంచి ఆలోచనతట్టింది. ఈ ప్రాజక్టులన్నీ ఎందుకు కడుతున్నారంటావు చెప్పు.

ఎందుకేమిటి. అధికాహారోత్పత్తికిగా అదే నేనూ అనేది. అధికంగా ధాన్యాలు పండించ బడితే మనబోటి చిన్నవర్తకులం ఏమై పోవాలి చెప్పు. ప్రభుత్వం కాస్త యినా ఇలాంటివాటిల్లో మనలాంటివాళ్లని అడిగి మన సలహామీద నడవాలంటావా లేదా? నిజానికి ప్రభుత్వం మనతరఫున లేదోయ్. చూడు పై పెచ్చు మనలాంటి ఈ అష్టకష్టలకి చందాలిమ్మంటుంది. మన కీకలు తీసేవాటికి మనం చందా లివ్వాలా?

అంటే?

అంటే ఏమిటి? ఇందుకనే నీది చిన్న బుర్రన్నాను. కొంచెం పెద్దబుర్ర ఉంటే ఎందుకైనా మంచిది. గుప్పెడు బెంకాయలో నీళ్లన్ని ఉంటాయి. అమలాపురం గంగాబొండాంలోపల త్రాగాలి కడుపు నిండాలి. మరి పంటలు హెచ్చుగా పండితే వర్తకులలో వర్తకులకు పోటీవచ్చే య్యదుగోయ్ జరిపుల్లయ్యా. పోటీ ఉంటే, నువ్వూ నేనూ బ్రదుకు తామా? హెచ్చుపంట ఉంటే వర్తకులలో ఐకమత్యం దివాలా తీస్తాదిగా.

మరిమనదబ్బు పైదేశం పోదటరా.

పోతేమునకేం. ముందు మనమూ మనచుట్టుపక్కల వాళ్ళూ? పైవాళ్ళకి కొంత కడితేనేగాని మనకు అసలు కూడ కిట్టదు.

జ్ఞానాను. నేనింతదూరం ఆలోచించ లేకపోయాను.

అంతటితో అయిపోయిందనుకోకు. ఈ ప్రాజెక్టులను ఆపేశాం సరే. మరిజధనిధి శాస్త్రకారు లోకళ్ళ దేశాలమీద జయాళ్లా హెచ్చయి పోతున్నారుగా! వాళ్ళ తస్సాదియ్యా వాళ్ళబుర్రల్లో పొలర్లలో ఉరుతా యను కొంటాను వాళ్ళకక్కడ లేని. ఎరువులు తయారుచేసేసి ఏడాదికి నాలుగైదేసి పంటలు పట్టి పల్లెపల్లెలో కూడపండించేస్తారట. ఇలాంటప్పుడు మరి చిక్కే. మరి అప్పుడేం చెయ్యాలో తెలుసా? ఒక తెలిసిన శాస్త్రకారుణ్ణి మనం కొనెయ్యడం. కొనేసి, ఒరే అబ్బాయి, పంటల్ని త్వరితంగా చేసే పురుగుల్ని ఇవ్వరా అనటం వాడు ఇస్తాడు కదూ, అప్పుడు మనం ఆ పంటల మీద వాటిని వదలేయడం ఇక చూసుకో అప్పుడు మనపంట. మనదగ్గర ఉన్నవాటికి ఎంత గిరాకీ వస్తుందనుకున్నావ్.

అమాంతంగా అన్ని పంటలు పాడు చేసెయ్యడమే.

ఆ.

ఎక్కడుంచి వచ్చిపోతారంటావ్.

అసలు నీకిలాంటి అనుమానాలు రాహు

(12-వ పేజీ చూడుడు)

కథానిక

# వ్యర్థజీవి

మూలం: ఛెకోవ్
అనువాదం: పుతలీబాయి

అది యవ్వనం తొణికిసలాడుతూ అందంతో మిసమిసలాడుతున్నప్పుడు జరిగిన సంగతి: నికొలాయ్ పెట్రోవిచ్ కొపాల్కొవ్, తన ఆరాధకుడు, ప్రక్కగదిలో ఉన్నాడు. ఎండ తీక్ష్ణంగా ఉంది. అప్పుడే భోంచేసి చవకబారు సారా తప్ప త్రాగడంవల్ల చికాకుగా ఉన్నాడు నికొలాయ్. ఇద్దరికీ కూడా విసుగ్గా ఉండడంవల్ల చల్లబడగానే షికారుకి వెళ్దామనుకుంటున్నారు.

ఇంతలో తలుపు తట్టిన చప్పుడైంది. కూర్చున్న పెట్రోవిచ్ చటుక్కున లేచి ఎవరని ప్రశ్నార్థకంగా పాషాకళ్ళలోకి చూశాడు.

'పోస్టుమానేమొ! లేకపోతే అడపిల్లలా!' అంటామె. పాషా స్నేహితురాండ్రయితే ఫర్వాలేదతనికి. పోస్టుమానయితే అసలు కదలవలసిన అవసరమే లేదు. ఐనా ఎందుకైనా మంచిదని ప్రక్కగదిలోకి వెళ్లిపోయాడు.

పాషా తొందరగా వెళ్లి తలుపు తీసింది. అరచ్చినవ్యక్తి ఆమె అనుకున్నవారెవరూ కారు. ఒక అపరిచిత స్త్రీ. మనిషి వాలకం బట్టి మర్యాదస్థురాలని చెప్పవచ్చును. ఎంతో దూరంనించి నడిచొచ్చినట్టు ఆమె ఆయాసంతో వగరుస్తోంది.

'ఏమిటండి' అంది పాషా.

ఆ స్త్రీ వెంటనే జవాబియ్యలేదు. గదిలోకివెళ్ళి గదంతా కలయజూసింది. విసుగ్గా ఇంకనిల్చోలేక కూర్చుంటోన్నట్టు చతికిల పడింది. మాట్లాడ్డానికి ప్రయత్నిస్తోన్నట్టు పెదవులు కదిపింది.

పాషా కేసి తలెత్తి చూసి 'మా ఆయన ఉన్నారా?' అనిఅడిగిందామె. ఏడుపువల్ల కళ్ళు ఎర్రబడి వాచాయి.

'మీ ఆయనా' పాషా కెందుకో భయం వేసింది. పాలిపోయిన మొహంతో మళ్ళా 'మీ ఆయనా' అంది.

'ఆ. మా ఆయనే నికొలాయ్ పెట్రోవిచ్,'

'లేరండి నేనెవరినీ ఎరగను' అంది తడబడుతూ.

ఇద్దరూ కాసేపు మాట్లాడకుండా కూర్చున్నారు. ఆ స్త్రీ ఆయాసం, వణకూ తగ్గినా రుమాలుతో వినుకుంటూ కూర్చుంది. పాషా ఆశ్చర్యంతో ఆమెకి కళ్ళప్పగించి, బొమ్మలాగ భయంగా కూర్చుంది.

'ఐతే ఆయనిక్కడ లేరంటావా' అని ఆ స్త్రీ తమాషాగా నవ్వుతూ అడిగింది.

'మీ రెవరినిగురించి అడుగుతున్నారో తెలియడంలేదండి' పాషా.

'నంగనాచివి! ఏం తెలియదు పాపం. రాక్షసి! నిన్ను కలిసి నిజం ఇలా చెప్ప గల్గినందుకు సంతోషిస్తున్నాను.'

ఆమె కళ్ళని, ఆమె వైఖరి చూస్తే పాషా కెందుకో ఒకవిధమైన భయం వేసింది. లేత తమలపాకుల్లా ఉన్న ఆమెని చూస్తే పాషాకి సిగ్గేసింది. తన బుగ్గలు, ముక్కుమీద మచ్చ, ముందర కత్తిరింపు జుట్టు-ఎంతదువ్వినా అంతేగా అది ఛీ! ఆమెముందు నిల్చుంటేనే కూడా సిగ్గేసింది. ఆ కత్తిరింపు జుట్టు లేకపోతే ఆ గౌరవ కుటుంబీకురాలి దగ్గర కూర్చోడానికంత చిన్నతన మనిపించేది కాదేమొ!

'మా ఆయనేరి. ఎక్కడున్నా నాకేం బెంగలేదు. కాని పోయిన డబ్బుకోసం పెట్రోవిచ్‌ని గాలిస్తున్నారు. అరెస్టు చెయ్యాలని. ఇదంతా తమరి మహిమేగా.

లేచి ఆమె ఆమె గదిలో పచార్లు మొదలెట్టింది. పాషాకి ఆమెను చూస్తోన్న కొద్దీ భయం ఎక్కువౌతోంది. ఏం చెయ్యాల్లో తెలియకుండా దామెకి. అసలు సంగతేమిటో బోధపడలేదు.

'ఇవాళ పట్టుకుని అరెస్టుచేస్తారు' ఆమె గుండెలు బాదుకుని ఏడుస్తోంది. ఏడుస్తూనే 'ఈస్థితికి బాధ్యులెవరో నేనెరుగుదును. నీచురాలా! పాపీ! నాకింక దిక్కులేదు. వింటున్నావాకేకలు! వినిపిస్తోందా? నాకింక దిక్కులేదు. నీకంటె కనికష్టమేమొ! నువ్వే ఎక్కువనాకన్నా. చెట్టుమీద పక్షి నయం నాకన్నా. నన్ను కనికరించేవారెవరూ లేరీ ప్రపంచంలో. ఒక్కడే ఉన్నాడింక. నన్నూ, నా పిల్లల్నీ చూడడానికి ఆ భగవంతుడొక్కడే ఉన్నాడు. దేవుడికి న్యాయంలేదు! అంది పైకి చేతులెత్తిచూపిస్తూ. ఆ రోదనస్వరంలో కూడా ఆమెకి పాషామీదున్న ద్వేషం, అసూయం స్పష్టమౌతున్నై.

ఆమెమొహం కోపంతో ఎర్రబడింది.

'నా ఉసురు నీకెలాగా తగుల్తుంది నీకు. భగవంతుడు నా ఏడుపువిని నీకెలాగా కీడు చేస్తాడు. లేకపోతే మేలు జరుగుతుందంటావా? ఒకనాటికి కాదు నాకసురం. ఎప్పటికైనా తగుల్తుంది. అప్పుడు జ్ఞాపకం తెచ్చుకుంటావు.'

మళ్ళా కాసేపు మాట్లాడకుండా ఉందామె. చేతులుకట్టుకుని గదంతా అలంగం తిరుగుతోంది. పాషా కేంచెయ్యాల్లో తెలియక ఏదో కొంప మునుగుతోందని భయపడుతూ ఆమెకేసి చూస్తోంది.

'నాకా సంగతేం తెలియదమ్మా' అని బావురుమంది.

'అబద్ధాలు! అని అరిచిందా స్త్రీ. ఆమె కళ్ళు చింత నిప్పుల్లాగ ఉన్నాయి.

'నాకంతా తెలుసు. నిన్ను చాలా కాలంనుంచీ ఎరుగుదును. నీతో నెల్లాళ్ళనించీ ఉంటున్నారన్న సంగతి కూడా నాకు తెలుసు.'

అవును. ఐతే ఏం. ఏం చెయ్యమంటారు నన్ను! చాలామంది వస్తారు నాకోసం. కాని నేనెవరినీ రమ్మని బ్రతిమాలడంలేదు. బలవంతపెట్టలేదు. ఆయన కిష్టమై వచ్చారు. అంతే. నేను రమ్మనలేదు.

'వాళ్లు డబ్బుపోయిందంటున్నారు. ఆఫీసు డబ్బు వాడుకున్నారన్నమాట. అమ్మగారికోసం ఆపని చేశారు.' ఆమె కాసేపాగింది,

మళ్ళ ఇలా అంది.

'నీకేం నీతిలేక పోవచ్చును. పాపం చెయ్యడం కోసమే పుట్టావ్! నీలాంటివాళ్ళందబట్టే ప్రపంచం ఇలా తగలడింది. కాని నీలో మానవత్వం పూర్తిగా నశించిందని ఎవరూ అనుకోరు. ఆయనకు పెళ్లాం బిడ్డలున్నారు. కోర్టుజడ్జి జైలుకి లాక్కుపోతే మాకేం దారిలేదు. పిల్లలూ నేనూ నల్లుల్లా మాడి చావాలి. తెలిసిందా కాని దీన్నుంచి తప్పించుకోడానికి వీలుంది. ఇవాళతో మిగిలిన దలరూ నిల్చిస్తే చాలు. వదలిపెడ్తారు. ఒక్క తొమ్మిది వందల రూబుల్సు! అంతే కావాలి.

'తొమ్మిదివందల రూబుల్సా! అంది పాషా నెమ్మదిగా 'నాకేం తెలియదమ్మా.

'నీదగ్గర డబ్బు ఉండదను. నీడబ్బు ఇమ్మని ప్రాధేయపడడంలేదు. నేనడిగేది వేరు. మొగాళ్లు నీలాంటివారికిమంచిమంచి వస్తువు లిస్తారు. ఆయనిచ్చినవిఇచ్చేసెయ్యి. చాలు.'

'నాకేమీ ఇవ్వలేదమ్మా' అని పాషా ఏడ్చింది. పాషా కిప్పటికి సంగతి బోధపడింది. ఆమె ఎందుకువచ్చిందో అర్థమైందామెకు.

'అలాగయితే ఏమయింది. తనది. నాదీ ఊళ్ళో వాళ్ళది, చివరికి ఆఫీసు డబ్బు కూడా వాడేశారు. ఇంతా ఏమైనట్టు. పోరటి కర్పూరం లా రెండు నిముషాల్లో అయిపోయిందంతా. విను. నిను బతిమాలుతుంటా. ఇవి చేతులుకావు కాళ్లనుకో. చికాకుఉండి మనను బాగాలేకపోవటాగా ఏమీ అనుకోకు. నువ్వునన్ను అసహ్యించు కుంటున్నావని తెలుసు. కాని నా పరిస్థితిలో నువ్వు ఉన్నాననుకుని ఆలోచించు. నావస్తువులు నాకిచ్చెయ్యి. నీకు దణ్ణంపెట్టా దయచేసి. ఇచ్చేసెయ్యి. రక్షించినదానివౌతావు నీమేలెన్నటికీ మరచిపోను.'

పాషా తలనిప్పుతూ, 'అలాగే ఇచ్చేదాన్ని. కానిదైవ సాక్షిగా చెప్తున్నాను. నాకాయన ఏమీ ఇవ్వలేదు. నమ్మండి కాని ఇంతలో ఏదో జ్ఞాపకం వచ్చినట్టు.

'అజ్ఞాపకం వచ్చింది. ఏవో రెండు వస్తువులిచ్చారు. కావలిస్తే ఇస్తాను తీసికోండంది' ఖంగారుగా.

డ్రాయరులాగి ఒకగాజు ఒక కెంపు ఉంగరం తీసి ఆమెకిచ్చింది. ఆ స్త్రీకి సిగ్గేసింది, మొహం లజ్జతో ఎర్రబడింది. ఆమె అభిమానం దెబ్బతిన్నట్టయింది.

ఖంగారుగా తడబడుతూ 'ఇదేమిటి, ఇదిస్తున్నావేమిటి? నేనేందయ చూపమని నిన్ను ప్రార్థించడంలేదు. నావి నాకిమ్మన్నాగాని ఇతరుల వస్తువులు పుచ్చుకుంటూ నిమ్మన లేదండి' రోషంతో.

'మునవారంనాడు మీరిద్దరూ వీధిషికారు వెళ్తోన్నప్పుడు నీ నగలన్నీ చూశాను. కనక అబద్ధాలు చెప్పి లాభం లేదు. నన్ను మోసగించలేవు. ఆఖరుసారి అడుగుతున్నా, నా వస్తువులు నా కిస్తావా ఇవ్వనా చెప్పు?

'చాలా తమాషాగాఉంది. భలేవారు మీరు. నేను ఆ గాజూఉంగరం తప్ప ఇంకోటి ఎరగను. ఒట్టుపెట్టుకు చెప్తున్నా. నా కాయనేం ఇవ్వలేదు. ప్లమలూ మిఠాయి తప్ప' అంది పాషా.

'మిఠాయా!' ఆ స్త్రీ వికటంగా నవ్వింది.

'ఇంట్లో మింగ మెతుకు లేదుగాని ఇక్కడి అమ్మగారికి మిఠాయి! అలాగయితే వస్తువులు తిరిగి ఇవ్వదలుచుకోలేదా ?'

పాషా ఏం మాట్లాడలేదు.

'ఇంక నేనేం చెయ్యను? తొమ్మిదివందల రూబుల్సియ్యలేకపోతే ఆయన్ని పట్టుకుపోతారు. ఇంక అందరం ఏసిచావాల్సిందే. ఇంక్కడా కోటమన్నే. దీన్ని చంపనా? లేకపోతే కాళ్లమీద పడి రక్షించమననా?'

నుంచెలు బాదుకుంటూ ఆమె 'ఆయన్ని పాడుచేశావ్. ఇంకే నా రక్షించు. ఆయనమీద ప్రేమ లేకపోవచ్చు. పిల్లల్ని కనికరించు. వాళ్లేం చేశారు నిన్ను?'

చిన్నపిల్లలు వీధిలో నిల్చుని ఏడుస్తోన్నట్టనిపించింది పాషాకి. ఆమె గుండె నీరయింది. ఒళ్లు జలదరించింది. ఏడుపు ఆపుకోలేకపోయింది ఏడుస్తూ.

'నన్నేం చెయ్యమంటారు. నేను మీ ఆయన్ని పాడుచేశానన్నారు. నీచురాలన్నారు. శిలువమీద ఒట్టుపెట్టుకుని చెప్తున్నా. నమ్మండి. నేనా రెండు వస్తువులు తప్ప ఆయనిదేం ఎరగను. మేం అందమైన మర్యాదస్థుల్ని ఆహ్వానిస్తాం. పెట్రోవిచ్ మర్యాదస్థుడు. వస్తేరానిచ్చాం. మేం అందర్నీ ఆహ్వానిస్తాం. అంది.'

నేనునావస్తువులడుగుతున్నా. ఇచ్చెయ్. ఎన్ని సార్లు అడుక్కుంటున్నాను నిన్ను! ఎంత నీచపడిపోతున్నాను! కాళ్లమీద పడతా ఇచ్చేసెయ్యి, నా వస్తువులు నాకిచ్చెయ్యి, నన్ను రక్షించినదానివౌతావ్.

పాషాకి భయంవేసింది. ఇంత సేపు ధీమాతో తిట్టి నిందించిన స్త్రీ ఎంతలో నీచపడిపోతోంది. తన కాళ్లమీద పడడానికి కూడా సిద్ధపడ్తోంది! నిజంగా కాళ్లు పట్టుకుంటుందేమొనని భయపడిందామె. చేతులుతో వద్దని చెప్పుతూ.

అలాగే ఇస్తానండి. కాళ్ళమీద పడతానన్నందుకు పాషాకి కోపం వచ్చింది. కళ్లు తుడుచుకుని 'అలాగే ఇస్తా కాని అవి నికొలావ్ ఇచ్చినవికావు. ఎవరో ఇచ్చారు మరి.'

డ్రాయరులాగి రవ్వలపైట పిన్ను నెక్లెస్సు, గాజులు ఉంగరాలు తీసింది.

'కావలిస్తే ఇవన్నీ తీసికోండి. కాని ఇవిమట్టుకు నేనాయన దగ్గర్నించి తీసికొన్నవికావు. ఇవి తీసికొని గొప్పవారవండి, సుఖపడండి'.

ఆమె నంత నిందించినందుకు చాలా కోపం వచ్చింది పాషాకి.

'నిజంగా మీరే సంసారులై, ఆయన భార్య ఐతే బయటకిరాకుండా అదుపు ఆజ్ఞల్లో ఉంచుకోవాలనుకుంటాను. నేను మీ ఆయన్ని రమ్మనలేదు. ఆయనే వచ్చారు.'

ఆ స్త్రీ కళ్లు తుడుచుకుంటూ ఆ నగలు పువ్వుతుంది.

'ఇవి చాలవు. వీటి ఖరీదు 500 రూబుల్సుకన్న యెక్కువ ఉండవు. ఇంకా కావాలి' అందామె.

పాషా ఏం ఆలోచించకుండా డ్రాయరు లాగిఉన్నవి తీసి ఆవిడ చేతులో పడేస్తూ.

'ఇంకేం లేవు. కావలిస్తే వెదుక్కోవచ్చుండి.'

ఆ స్త్రీ నిట్టూర్చి అవన్నీ రుమాలులో భద్రపరచి కిక్కురు మనకుండా వెళ్లిపోయింది. తలుపుతీసికొని నికొలావ్ పెట్రోవిచ్ బయటకు వచ్చాడు.

పాషా 'మీరు నాకేం ఇచ్చారని' గట్టిగా అరిచింది. నికొలావ్ మొహం పాలిపోయింది. కళ్లల్లో నీరు తిరిగింది. ఏదో మ్రింగిన వాడిలా బాధ పడుతున్నాడు.

'మీరేం ఇచ్చారు. నాకు?' అని మళ్ళీ గద్దించింది పాషా.

'దానికేంలే - పాపం నీ దగ్గర ఎంత కించ పడింది.'

'నేనడిగిన దానికి జవాబియ్యండంది, పాషా. 'అంత గౌరవ కుటుంబీకురాలు, అంత అభిమానవతి, నీదగ్గర ఎంత నీచపడింది! నీకాళ్ల మీద - అయ్యో నీకాళ్ల మీద పడ్డానికి కూడా సిద్ధపడింది! పాపం. అభిమానం చంపుకుని ఎలా మాట్లాడింది. ఈ గొడవకి, ఇంత రభసకి నేనే కారణం నామూలాన్నేగా ఈ గంద్రగోళమంతా. నేను చేసిన తప్పు క్షమించడానికి వీలులేనిది. నేనే క్షమించలేను ఈ తప్పుని!

ఛీ! నీచురాలా! నాదగ్గర్నించి పో అవతలకి' - పాషాని ఒక్క తోపు త్రోశాడు. చేయిని తలకి ఆన్చి

'అయ్యో! కాళ్ల మీద పడడానికి సిద్ధపడింది. అంత అభిమానవతి అలా మాట్లాడానికెంత బాధ పడిందో - ఆమె ఈ పరిస్థితికి రావడానికి కారకుడిని నేనే,

తొందరగా బట్టలు వేసికొని తలుపు దగ్గర ఉన్న పాషాని ప్రక్కకు నెట్టి తలుపు తీసికొని చరచరా వెళ్లిపోయాడు' ఆలోచించ కుండా నగలు ఇచ్చేసినందుకే ఆమె బాధ పడ్తోంది. దానికి ఇతని చర్య మరింత తోడైంది. ఇంతకు మూడేళ్లక్రితం ఒక వర్తకుడు ఇలాగే కారణం లేకుండా చావకొట్టి లేచి పోయాడు. అది జ్ఞాపకం రాగానే ఏడుపు పట్టలేక గట్టిగా ఏడుస్తోందామె.

# పెద్దాపురం తాలూకా తుపాను భీభత్సం

పెద్దాపురం తాలూకా తుపాను భీభత్సం - కూలిపోయిన ఎర్రవరం వంతెన

పెద్దాపురం తాలూకాలో వరదపాలైన పంటభూములు.

పెద్దాపురంలో మునిగిపోయిన యిండ్లు

చీరాలలో జరిగిన ఆంధ్రరాష్ట్ర చేనేత కాంగ్రెసు మహాసభ

# పనికిరాని మనిషి

(11-వ పేజీ తరువాయి)

పదు. ధైర్యంగా ముందుకు నడవాలి. ధైర్యమే ధనం. ధనమే ధైర్యం.

అప్పే అంతపని చేయడమేంరా?

ఛీ ఇంత పచ్చుపేసుగ వనుకోలేదు. అసలు ఇందులో మనంచేసిన తప్పేముంది? తుఫానురావడం లేదూ? పంటలు తుడిచుకు పోవటంలేదూ? అలాగే పురుగులు పట్టేశాయను కొంటాడు. ఒకొక్కప్పుడు వాళ్ళు వాటికివిరుగుడు కూడా వెయ్యొచ్చు. అప్పుడు అసరుకులు చవకగాకొని గిడ్డంగులలో నిలవేసి తగులబెట్టేస్తాం. ఇవతల ఇన్సూరెన్సువాళ్ళు వద్దా లాభం కొట్టొచ్చు. అవతల మిగిలిన సరుకు విలువా పెంచి అలాగకూడ చులాగ్గ లాభం తియ్యొచ్చు. ఒక్కదెబ్బని రెండు పిట్టలు కొట్టేస్తామన్నమాట.

ఏమిటిరా ఇలాంటి దారణాలు చెప్తున్నావు. హిట్లరులా అయిపోతున్నావేమిటి?

ఛీఛీ. హిట్లరేమిటి; వాడికి వర్తకం తెలియదురా బాబ్జీ. తడిగుడ్డలతో పీకలు కోసెయ్యాలి. మేకవన్నె పులుల్లా ఉండాలి. నొప్పి తగలకుండా పని జరుపుకోవాలి.

నేనిలాంటి మాటలెప్పుడూ వినలేదు. ఇదేం వర్తకంరా?

ఇందేం వర్తకమో నీకూ తెలుసు. కాని కొంచెం జాస్తీ అయ్యేప్పటికి జంకుతున్నావు. చిన్న వాపారంలో కొన్ని ప్రాణాలే పోవోచ్చు. అలాంటప్పు డిలాంటి ధైర్యాన్ని ప్రదర్శించి నిలబడ గలగాలి. అది ధైర్యంతో పెద్ద వ్యాపారంలో పెద్ద తరహాగా ప్రాణాలు పైకి పలాయనం చేసేటప్పుడు నిలబడి ఆ ధైర్యాన్ని, ఆ కౌర్య దీక్షను ప్రదర్శించాలి. ఇదిమహోధనయజ్ఞంరా బ్రదర్. ధనంలేనిది ధరలేదు.

నీకు మతిపోయిందా పిచ్చిపట్టుకుందా.

నీకు పోయినమతి, నీకుపట్టినపిచ్చేరా ఇది. చూడు. మనం ఇలాంటిపనులు చేసేప్పుడు ఒకొక్కొక్కప్పుడు ఎంత ధనాన్నైనా వెచ్చించవలసి ఉంటుంది. అప్పుడప్పుడు మనం మసికూడ అయిపోవలసివస్తుంది. అయినాసరే మనం నిలబడగలగాలి. కొన్ని సమయాలలో ఇలాంటిపనులకు స్త్రీలనుకూడ పరికరాలుగా ఉపయోగించుకోవాలి. ఉరికంబానికెక్కవలసివచ్చినా సహించాలి. ఇలాకొంతమంది మనలాంటి వర్తకుల ప్రాణాలు ఆహుతి అయితేనే గాని ఈ ఉద్యమం రూపుకట్టదు.

ఇదేం ఉద్యమంరా!

ఇదేమిటో నీకు తెలియదూ? ఇదినల్ల బజారోద్యమం. నల్ల అంటే రక్తం. రక్తం లేకపోతే మనిషిలేదు. నల్లబజారు లేకపోతే వర్తకంలేదు.

అబ్బ. ఎందుకురా ఈకొరడాదెబ్బలు. నీకొంతరాక్షసత్వం వచ్చేసిందే.

ఛా అలాభయపడతా వేమిరా. మనమేమీ తప్పుచేశాం. ప్రాజక్టులను ఆపించామని ఎవరికీ తెలుస్తుంది. పంటలు మనవల్ల పాడైపోయాయని ఎవరనుకుంటారు. మన దగ్గర సరుకు ఉంటుంది. అదైనాకొద్దిగా ఉంటుంది. వాళ్లకు కావాలి. అంచేత మన దగ్గరకు రావాలి. వస్తారు. ధర ఎంత అంటారు. ఇంతని చెప్తాం. వాళ్లకునచ్చితే కొనుక్కుంటారు. లేకపోతేలేదు. ఇందులో మనం చేసిందేముంది? మనతప్పేముంది?

అబ్బ! నాగుండెల్ని తినేశావు. ఇక నాగరాబాబూ!

ఇదిగో మళ్ళీ మొదటికే వస్తున్నావు. అన్నింటికీ దేవుడే ఉన్నాడు. ఎందుకలా ఇదయిపోతావ్.

ఛీ ఛీ ఇంత అధమాధమంగా మాట్లాడతావనుకోలేదు, క్రియారూపందాల్చబోయే ఎంతచక్కటి ఉద్దేశాలను మార్చేశావు. నిజానికి నువ్వు ఎందుకూ పనికిరావు.

(నవ్వుతో) నిజమే. నిజంగా నన్నెందుకూ పనికిరాకుండా చేశావు అయిదు నిమిషాల్లో.

చీరాలలో జరిగిన చేనేత కాంగ్రెస్ మహాసభ స్వాగతోపన్యాసకులు. శ్రీ అక్కుల కోటయ్య.

Edited, Printed & Published by
S. Sambhu Prasad at the Andhra Patrika
Press, No.7, Thambu Chetty St. Madras